క. శ్రీ జానకీ మనోహర
రాజీవ భవాది వంద్య రఘుకులతిలకా
రాజీవనయన మునిజన
పూజితపద రామచంద్ర పుణ్యచరితా॥

క. ధ్యానించెద మది విష్వ
క్సేనుని శ్రీ విష్ణు చరణసేవానిరతున్
నానావిఘ్న నివారణు
సేనాధిపు నప్రమేయు శ్రితజన పోషున్॥

క. వాణీ నిను వేడెదను పు
రాణీ నా రసనయందు రంజిల్లవె క
ల్యాణీ వీణాపుస్తక
పాణీ మాధుర్యవాణి పద్మజరాణీ॥

క. నారాయణ పుణ్యకథా
సారముఁ గ్రోలుచును సర్వసమతఁ బరగు శ్రీ
నారద గురుపద యుగములు
సారెకు మదిలోననుంచి సన్నుతి సేతున్॥

క. తులసీ కాననమందున
విలసితముగ హరినిఁ జూచి విస్మయయుతుఁడై
పులకీకృత తనుఁడగు నా
తులసీదాసవరు సన్నుతులు సేతు మదిన్॥

క. దురిత వ్రాతములెల్లను
బరిమార్చెడి హరి గుణములఁ బాడుచు నెపుడున్
బరవశుఁడై వెలయు పురం
దరదాసుని మహిమలను దలఁచెద మదిలోన్॥

క. కలియుగమున వరభద్రా
చలమున నెలకొన్న రామచంద్రుని పద భ
క్తుల కెల్ల వరుఁడనందగి
వెలసిన శ్రీరామదాసు వినుతింతు మదిన్॥

వ. ఇష్టదేవతాభివందనంబును సద్గురు ధ్యానంబును సల్పి, పూర్వభక్త వ్రాతంబునుఁ
గొనియాడి, మఱియు పాండురంగ, నామదేవ, జ్ఞానదేవ, సహదేవ, జయదేవ,
తుకారామ, శ్రీనారాయణతీర్థాది భగవద్దాసుల కెల్లం బ్రణమిల్లి నాయొనర్పం బూనిన
ప్రహ్లాద భక్తి విజయంబను ప్రబంధమునకు కృతినాయకుఁడగు శ్రీరామచంద్రుని
సంబోధన వాక్యంబునం జేరి విన్నవించున దెట్లనిన.

క. శ్రీకల్యాణపరంపర
సాకేతపురాధివాస సామజవరదా
నీ కారుణ్యమునే నే

నీకావ్యమొనర్చినాఁడ నింపుగ వినుమా ॥

క. శ్రీమత్పంచనదంబన
భూమిని విలసిల్లునట్టి పురవరమున శ్రీ
రామస్వరూపుఁడనదగు
రామబ్రహ్మార్యసుతుఁడ రాగరహితుఁడన్ ॥

తే. ఆగమాంత విహారివై యలరు నీకు
రాగతాళాదియుత గానరసముచేత
బాగుమీరంగ సంతోషపరచునట్టి
త్యాగరాజను పేరిటఁ దనరినాఁడ ॥

ద్వి. శ్రీచేత విలసిల్లు శ్రీరామచంద్ర! – వాచాలకునిఁ గని వరమిచ్చుతండ్రి ॥
నాటకంబొకటి నే నయముగా నీకు – నాటగావినిపింతు హాటకాభరణ ॥
ఆనాటకంబున నమరు మర్మముల – శ్రీనాథ పలికెద శ్రితులకు మ్రొక్కి ॥
జ్ఞాన వైరాగ్య విజ్ఞానసద్భక్తి – దీని భావములెల్ల దివ్యమై వెలుగు ॥
కనక కశిపుడు మున్ను కడుచలంబునను – తనయుని సకలబాధలబెట్టి మఱియు ॥
నాగపాశంబును నడుమునఁగట్టి – సాగరంబునవేయ సెలవిచ్చు మొదలు ॥
ప్రహ్లాదయోగికి ప్రబలవారిధికి – నాహ్లాదమగు వాదమందు రాజిల్లు ॥
ఘనుఁడైన నారదాగమనంబుచేత – జనియింపఁబడి జాలిఁ జెంది మూర్ఛిల్ల ॥
నామీద మాధవుండావిర్భవించి – సామర్థ్యములనేచి సలలితుండగుచు ॥
ముమ్మారు నెదురుగ ముదముతో నిల్చి – సొమ్మసిల్లిన వేడ్క సొంపుగానుండు॥
రాగతాళ మృదంగ రవళిచే మిగుల – నాగరికం బభినయముచేఁ జెలగు ॥
భక్తాగ్రగణ్యుఁడై పరమ ప్రహ్లాద – భక్తి విజయంబన బాగైన కృతిని ॥
అనిశంబు నిది పుష్ప హారంబుగాను – దనివార ధరియించు ధరసుతా రమణ ॥
సగుణ నిర్గుణముల సమముగా నెంచు – సుగుణ రామబ్రహ్మసుతుఁడైన త్యాగ ॥
రాజు పల్కిన కథారసమెవ్వరైన – రాజిల్ల జేసిన రమ్యమై వినినఁ ॥
గోరినఁ జదివినఁ గొనియాడుకొన్న – వారికి ఫలముల వ్వారిగా నొసగి ॥
తప్పులొప్పులనైనఁ దాలిమిజేసి – యెప్పుడు దయచేత నేలుకోవయ్య ॥

వ. ఈ ప్రహ్లాద భక్త విజయమను నాటకారంభమున సకల విఘ్న నివారణుండగు
విఘ్నేశ్వరుండు వేంచేయు విధం బెట్టులనిన.

ద్వి. కరిరాజ వదనుండు కర్పూర నిభుఁడు – గిరిసుతాసుతుఁడు సంగీత లోలుండు॥
అంబుజ సంభవాద్యమరులు గొలువ – జంబూ ఫలంబులు చవి చూచు కొంచు ॥
ధర్మాధిఫలముల దయ సేతుననుచు – నిర్మల హృదయుఁడై నిర్వికారుండు॥
సొక్కుచు సోలుచు సొగసుగా వెడలె – మ్రొక్కి సేవించెదము ముదమున రారె ॥

శ్రీగణేశుల ప్రవేశము

కీర్తన సౌరాష్ట్ర – ఆది

పల్లవి: శ్రీగణపతిని సేవింపరారే – శ్రిత మానవులారా

అనుపల్లవి: వాగాధిపాది సుపూజలఁ జేకొని – బాగ నటింపుమను వెడలిన

చరణ (1): పవన నారికేళాది జంబూ – ఫలముల నారగించి
ఘన తరంబుగను మహిపై పదములు – ఘల్లు ఘల్లన నుంచి
అనయము హరిచరణ యుగములను హృద – యాంబుజమున నుంచి
వినయమునను త్యాగరాజ వినుతుఁడు – వివిధగతుల ధిత్తళాంగుమని వెడలిన

వ. ఇట్టి యాహ్లాదమగు ప్రహ్లాద భక్తి విజయమను నాటకోపక్రమ

సమయమునందు దౌవారికుఁడు వచ్చున దెటులనిన.

క. గడ గడని నడలతోడను
వడివడిగా నడుగులిడుచు వసుమతిలో తా
నెడలేక హరినిఁ బొగడుచు
నడుగడుగుకు సభనుఁ జూచి యడుగను వెడలెన్॥

దౌవారికుని ప్రవేశము

కీర్తన

కళ్యాణి - ఆది

పల్లవి — వాసు దేవయని వెడలిన యీ దౌ - వారికునిఁ గనరే

అనుపల్లవి — వాసవాది సుర పూజితుఁడై - వారిజ నయనుని మదిని దలఁచుచును

చరణ (1): నీరుకావి ధోవతులను గట్టి - నిటలమునను శ్రీచూర్ణముఁ బెట్టి
సారివెడలి యీ సభలోఁ జుట్టి - సారెకు బంగరు కోలనుఁ బట్టి

చరణ (2): మాటి మాటికిని మీసము దువ్వి - మన్మథ రూపుఁడు తానని క్రొవ్వి
దాటి దాటి పడుచునుఁ దా నివ్వి - ధంబున బలుకుచు పకపక నవ్వి

చరణ (3): బాగుమీఱ నటన సేయుచును - పతిత పావనునిఁ దా వేడుచును
రాగతాళ గతులనుఁ బాడుచును - త్యాగరాజ సన్నుతునిఁ బొగడుచును

వ. ఇవ్విధంబున దౌవారికుండు వచ్చి యీ నాటక మొనరించు సూత్రధారునింగని, ఈ సభ యేమి, ఈ దివిటీల ప్రభలేమి, ఈ మృదంగాది వాద్యఘోషలేమి, ఈ సొగసైన వేషము లేమి, యీ నాటకంబునకుఁ బేరేమి, దీని ఫలమేమి, యీ నాటకం బాడుమని యెవరానతిచ్చిరో, యీ వివరంబు నెఱింగింపు మనఁగా, ఆ సూత్రధారి యెఱిగించు మార్గం బెట్టులనిన.

ద్వి. యతులకు సురలకు నెల్ల వారలకు - సతులకు సుతులకు సద్భక్తులకును॥
నటులకు విటులకు నాల్గు జాతులకుఁ - జటుల కరోరులై చెలగు దైత్యులకు॥
విన్నను కన్నను వివరంబుగాను - పన్నుగా జనులెల్ల పరియించిరేని॥
ఇహపరంబులు గడిగి యిలను వర్ధిల్ల - మహికి వేల్పులు వచ్చి మఱి ప్రోచునట్లు॥
ఎందులే నాపద లెంతవచ్చినను - బంధించి యబ్ధిలోఁ బడవైచెనేని॥
మందుకైనను వాని మదివెతలేక - యందరు కీర్తించి యాడుకొన్నట్లు॥
త్యాగరాజ కృతంబయి యిది వెలసె - బాగుగ ప్రహ్లాద భక్తివిజయంబు॥
నాటకంబుగ సభానాయకుల్ మమ్ము - నాట గావింపరేయని యానతీయ॥
చైత్రోత్సవంబునఁ జెలగుచు మేము - చిత్రంబుగా సేయఁగోరెదము॥

వ. ఇవ్విధంబున పలికి సూత్రధారుండు దౌవారికునిఁ జూచి నీ వెచ్చటి వాఁడ విచ్చోట వచ్చిన విధంబేమి యెఱిగింపుమనగా, దౌవారికుం డెఱిగింప జేయు మార్గం బెట్టులనిన.

ద్వి. ఈడు లేనటువంటి యీ పురంబునను - వైడూర్య మణులెల్ల వసుధపైఁ బరచి॥
పందిళ్ళు కిన్నాబుపట్టుతోవేసి - మందీలమేల్కట్టు మఱిబాగఁ గట్టి॥
పనస రంభాద్రాక్ష ఫలగుచ్ఛ మమరఁ - గనకంబుచే నలంకారముల్ చేసి॥
వరమైన సాంబ్రాణివత్తులు నిలిపి - సురవారసుతుల నీక్షోణి రప్పించి॥
ఘన నాట్యములనెల్లఁ గావింపుఁడనుచు - ఘనుఁ డాపగేశుఁ డాజ్ఞాపించినాఁడు॥
నెరయ సింగారముల్ నేనటు చేసి - యెఱిగింపబోయెద నిలవిభుకరకు॥

వ. అని పలుకు దౌవారికుం గనుంగొని యిట్లు పురాలంకారంబు సేయుటకు గారణం బేమనఁగా దౌవారికుం డెఱింగింపజేయు మార్గం బెట్టు లనిన.

కథా ప్రారంభము

సీ. దనుజేశ్వరుని మాట తప్పక కింకరుల్ - శేషపాశంబుచేఁ జేర్చికట్టి
యబ్ధిలోఁ బడవైచి యచలముల్ పైవేయ - నంబుధి ప్రహ్లాదుఁడని యెఱింగి

సాధి సంగతిఁజేయ సమయంబనుచు - సంతసంబున గంగాది సతులతోను
నవరత్నమణి భూషణములచే విలసిల్లు - అసుర పుత్రుని నెత్తి యాదరించి
కనుల బాష్పంబు లొలుకఁగఁ గౌగలించి - లసితమౌనట్టి నగరంబలంకరింపు
మనుచు సెలవిచ్చెఁ దన ముఖ్యమంత్రికపుడు - సభకు వేంచేయు నీ వేళ సాగరుండు.

వ. ఇవ్విధంబున సముద్ర మహారాజు ప్రహ్లాదస్వామి కొఱకు ఘనమగు శృంగారములు సేయుటకుఁ గారణంబేమనగా దౌవారికుఁడు పలుకుటెట్టులనిన.

ద్వి. హరియు ప్రహ్లాదుండు నమృతంబు లొలుక - సరిసరివాదముల్ సలుపఁబోయెదరు॥
కనవచ్చుగా నేడు కనులపండువుగ - ననుచు వారిధిరాజు ఆనందమంది॥
మెఱుపుకోట్లను గేరు మేనును దాల్చి - కఱకు బంగరువల్వ కటియందుఁ గట్టి॥
ఆణిముత్యంబుల హారముల్ మెఱయ - మాణిక్యమయమగు మకుటంబు గదల॥
ప్రకటమౌ రథముపై ప్రహ్లాదు నుంచి - సకల వాద్యములెల్ల సన్నిధిమ్రోయ॥
శృంగారములచేత శ్రీమించు సభకుఁ - బొంగార జలరాజు భోరున వెడలె॥

కీర్తన యమునాకల్యాణి - రూపకం

పల్లవి సాగరుండు వెడలెనిదో - సారెకుఁ గనరారె

అనుపల్లవి బాగుగ ప్రహ్లాదుని వర - యోగిని కౌగిటఁ జేర్చి

చరణ (1): మందరధరుఁడానంద - కందుఁడు తన హృదయార
విందంబున నెలకొన్న - సౌందర్యములను దలఁచుచు

చరణ (2): వారణములపై భేరీ - వాద్యంబులు మ్రోయగ సుర
వారస్త్రీల నాట్యపు - వరుసలఁ జూచుచు వేడ్కగ

చరణ (3): రాజిల్లెడి శ్రీత్యాగ - రాజసఖుని మనసార
పూజించుచునుండు దనుజ - రాజకుమార సహితుఁడై

వ. అంతట సముద్ర మహారాజు నాగపాశ బద్ధుఁడై యున్న ప్రహ్లాదుని నవరత్న ఖచిత కనక సింహాసనముపై నునిచి నిజ భక్తి సంభాషణము నందు నాస గలవాఁడై యట్టి నాగపాశ విమోచనము సేయుకొఱకు నంజలింపుచు గరుడ ప్రార్థన చేయుటెట్టు లనిన.

క. ఖగరాజ నీకు మ్రొక్కెద
గగనంబున నుండి వెడలి గ్రక్కునను బలో
రగ బాధ లెల్లఁ దీర్పుము
వగ దెలియని బాలుఁడయ్య వరగుణసాంద్రా॥

కీర్తన హుసేని - రూపకం

పల్లవి వినతాసుత రారా నా - వినతిఁ గై కొనరా

అనుపల్లవి ఘన నాగ పాశముల ఖండించ రారా

చరణ (1): అమరేశుని గెలిచి నీ - వమృతము దెచ్చి
విమల కీర్తి వహించి - విలసిల్లిన వీరా

చరణ (2): హరికి వాహనమౌ మాయయ్య వేగరారా నీ
సరియౌ భక్తుని బ్రోవ సమయమిది రారా

చరణ (3): త్యాగరాజ నుతుని దాసుఁడౌ ధీరా
నాగాశన నిన్ను వినా గతెవ్వరురా

వ. ఇవ్విధంబగు అర్ణవుని స్తోత్రములచే సుపర్ణుఁడు సంతోషాక్రాంతుఁడై సువర్ణ పక్షములు మెఱయ సముద్ర మహారాజు నొద్దకు వచ్చేడి మార్గం బెట్టు లనిన.

ద్వి. కనకాద్రి ధరలోన కదలినయట్లు - ఘనమైన మేరుతో గరుడదేవుండు॥
నిజ భక్త తాపంబు నిర్వృతింపగను - భుజబలంబులచేత భువికేగువేళ॥
పక్షపాతములేని భక్త్యాగ్రగణ్యు - పక్షపాతముచేత పక్షముల్ గదల॥
ఇట్టె వేడ్కనువచ్చి యిలను చాలఁగొని - కట్టగ నుండెడి కాలసర్పముల॥
ఖండించఁ దుండించ గాళ్ళనేఁ జీర - దండించ జలరాజు తలఁపున నుండు॥
ఉష్ణము జల్లార్చ నురగాశనుండు - కృష్ణ కృష్ణాయని కీర్తించి వెడలె॥

కీర్తన

శంకరాభరణము - రూపకం

పల్లవి: విష్ణువాహనుఁ డిదిగో - వెడలెఁ జూడరే

అనుపల్లవి: కృష్ణ చరణ భక్తులలో - కీర్తిగల్గు భాగ్యశాలి

చరణ (1): రంగపతినిఁ బొంగుచు హృ - ద్రంగమునను దలఁచి
బంగరు సరిరంగు గల ప - తంగ రాజు తాననుచును

చరణ (2): వరుణాలయు మొరలిటు విని - కరుణా పూరితుఁడై
హరి భక్తుల పరితాపము - హరియింతు ననుచు వేడ్కగ

చరణ (3): రాజిల్లు విరాజాధిపుఁ - డీ జగమున కేగి యిహ
రాజ రాజభోగి త్యాగ - రాజనుతుని దాఁ బొగడుచు

వ. ఈ లాగున వైనతేయుండు వేంచేసి పరమ భాగవత కులాలంకారుఁడైన ప్రహ్లాదుని మేనియందు
బద్ధమై యున్న నాగపాశములను జూచి యత్యంత కోపముతో నేమి సేయుచున్నాడనిన.

క. మాయాతీతుని తనువును
బాయని నాగములఁగొట్టి బాగుగ మదిలో
హాయిగ దలఁచుచు మౌని
ధ్యేయునిఁ దాఁ జూడ వైనతేయుఁడు వెడలెన్॥

వ. అంతట నాగపాశ విమోచితుఁడయ్యు అంతరంగమున శ్రీహరి చరణకమల చింతాపరాయణుండై
మైమఱచి యానందాంబుధిలో నోలలాడుచునుండు ప్రహ్లాదస్వామికి బాహ్య బోధకలుగుటకై
సముద్ర మహారాజు అత్యంతమగు ప్రేమాతిశయమునఁ బలుకుటెట్టులనిన.

సీ. ప్రహ్లాద నా భక్తి భాగ్యంబు నీవల్ల - ధరలోన సజ్జనుల్ దలఁచనాయె
సాధుసంగతి నేను సలుపఁగా వచ్చితి - మాధుర్య వాక్కుచే మాటలాడు
అంతరంగపు రాజ్యమనుభవించుట నిల్పి - భావంబు బాగుగా బయులు పఱపు
వర్ధిల్లుదువు నీవు వారిజాక్షునిఁ జూచి - దద్దరిల్ల పనేమి ధర్మశీల
వైనతేయుండు పాశముల్ వదలఁజేసె - మేను వెతలెల్లఁ దెలియక మిగుల నీవు
పద్మజానంద జలధిలో బాగుమీర - పవ్వళించుట లిక చాలు బాలయిపుడు

వ. సాగరుండు మఱియు ప్రహ్లాదస్వామిని జూచి యత్యంత నైతికాంతరంగుడై
పలుకుట యెట్టులనిన.

క. సాగరుఁడ నేను వచ్చితి
బాగుగ గనులారఁ జూచి భాషింపవయా
భాగవతుల చెలిమిని నను
రాగముననుఁ జేరవారు రంజిల్లరొకో॥

వ. ఇవ్విధంబున బలికిన సుధామాధుర్యమగు గంభీరధ్వని విని యే మహాత్ములో,
యే పెద్దలో, యెఱిగి సత్కరింపకయుంటినే యను భయభక్తితోఁ గూడినవాఁడై కనులు
వికసింపగా తరుణార్క ప్రకాశుఁడై కరుణామూర్తి యగు వరుణాలయునిం గనుంగొని
యత్యంత హర్షాశ్రు పులకాంకితుడై సాష్టాంగముగా మ్రొక్కి పలుకుట యెట్టులనిన.

క. ఎప్పుడు వేంచేసితిరో

యప్పుడె మాటాడలేక యలసుఁడనైతిన్
తప్పును సయిపుము సాగర
యిప్పుడు పదములకు దండమిడెదను సుమీ॥

వ. ఇటువలె నమస్కరించిన ప్రహ్లాదుని గనుగొని సముద్ర మహారాజు కానుకలొసఁగి పూజించున దెటులనిన

క. వరభక్తమణులఁ జేకొను
హరియెట్లో నాకు నీవు నాలాగు సుమీ
హరి భక్తుల నర్చించని
నరజన్మంబిలకు మోపు నాలుఁగు దెసలన్.

శ్లో. అభ్యర్చయిత్వా గోవిందం తదీయాన్నార్చయంతి యే।
నతే విష్ణోః ప్రసాదస్య భాజనం డాంబికా జనాః॥

శ్లో. అర్చాయా మేవతు హరేః పూజయా శ్రద్ధ యేహ్యతే।
నతద్భక్తేషు చాన్యేషు న భక్తః ప్రాకృతః స్మృతః॥

శ్లో. తులయామల వేనాపి న స్వర్గం నా పునర్భవం।
భగవత్సంగి సంగస్య మర్త్యానాం కిముతా శిషః॥

శ్లో. అమృత శ్రుతి మీప్సితార్థ లాభం నిధి సందర్శన మైంద్రమాధిపత్యం।
అపవర్గ ఫలోదయోపి పుంసాం నతులామర్హతి సత్సమాగమస్య॥

వ. ఈ విధంబున మహావాక్యంబులం బలికి కానుక లొసఁగిన మహాప్రసాదంబని కైకొని
ప్రహ్లాదుండు సముద్ర మహారాజునుఁ జూచి భక్తిపారవశ్యముచే స్తోత్రంబుచేయు
మార్గం బెట్టులనిన.

సీ. స్థితిలయోద్భవములు శ్రీ హరి వేడ్కగా గావించ చూచితి గాసిదీర
నీయందుఁ బవళించి నిర్మలాత్ముఁడు యోగ – నిద్ర సల్పును గదా నిత్యముగను
నా పూర్వ పుణ్యంబు నయమున నుండఁగ – నీవంటి మహితాత్ము నేనుగంటి
భ్రమర కీటము రీతిఁ బనిఁబూని సేయవే – హరిని సేవించుట కాసగొంటి
నీకు సరిలేదు జగతిని నిర్మలాత్మ – వనధి సర్వజ్ఞ! లోకజీవనుఁడవయ్య
జగముఁ బాలింపుచున్నావు సత్యముగను – తలచుకొనునట్టి భాగ్యము తనకు గలుగు.

వ. అంతట ప్రహ్లాదుండు ఆత్మార్థమై సాక్షాద్భగవంతుండగు శ్రీమన్నారాయణమూర్తి
ప్రత్యక్షంబగుటకై సముద్ర మహారాజును వేడుకొను మార్గ మెట్టులనిన.

క. సాగర నీయందే హరి
బాగుగ బవళించు నల ఉపాయంబు దయతో
వేగమె తెలుపుము నే నీ
వే గతియని నమ్మినాను వేమరు జలధీ॥

కీర్తన తోడి – చాపు

పల్లవి వారిధి నీకు వందన మొనరించెద

అనుపల్లవి సారెకు నీహృద – యారవిందమున ను
మారమణునిఁ గూడు – దారిఁ దెలుపుము నాతో

చరణ (1): నాయెడ దయయుంచి సాకుమీ యెడ
బాయకుండు దారితెలుపుమీ ముని
ధ్యేయునితో మాటఁ బలుకుమీ ఏ యు
పాయమైన చేసి ప్రాణము నిల్పుమీ

చరణ (2): దనుజ బాధలనెల్ల దలఁచను భోగ
ధన సంపదలకు చెయి చాచను నా

మనమున హరిని నే మానను నా

కనులార నాథునిఁ గన దెల్పుము

చరణ (3): ఆజన్మ మసుర బాధాయెను జల

రాజ! ప్రాయంబై దారాయెను త్యాగ

రాజసఖుఁడు రాడాయెను విను

మాజానుబాహుఁడు అగపడఁ దెలుపుమీ

వ. ఇవ్విధంబున నతిదీనుండై పలికెడు ప్రహ్లాదునిఁ జూచి యతని యంతరంగ
భక్తిఁ దెలిసి సముద్ర మహారాజు కొనియాడు మార్గం బెట్టులనిన.

ద్వి. ఎల్లకాలమునీవు నేర్పడమదినిఁ - గొల్లగాఁ బూజించుకొన్నది వినుము॥
చిత్తంపు బంగారు సింహాసనమున - నుత్తమోత్తమునుంచి యూర్జితంబయిన॥
ధ్యానమౌ పన్నీటిధారచే హరికి - స్నానంబుగావించి సంతసిల్లుచును॥
అభిమానమను వస్త్ర మమరంగఁగట్టి - విభునిపై జనువను వింతరత్నముల॥
ఘనభూషణములిడి కనికరంబుగను - నీదుపుణ్యములను నిర్మలంబైన॥
స్వాద్వన్నములు పెట్టి స్వానందమునను - నానందమను విడెంబమరగా నొసఁగి॥
మనసారఁ జూచుచుఁ దనువును మఱచి - యనిశంబు నేకమై యానందమంది॥
త్రిజగంబులను నీవు తృణముగానెంచి - విజయంబు చేకొన్న వీరుఁడవగుము॥
త్యాగరాజార్చితు దశరథపుత్రు - నాగమసంచారు నఖిలలోకేశు॥
గనులార సేవింప గాంక్షించినావు - వినుతులు సేయవే విశ్వాసముగను॥

వ. ఇవ్విధంబున సముద్ర మహారాజు ప్రహ్లాదునకు భగవద్దర్శనోపాయంబుఁ బల్కు సమయంబున,
తనలోతానే సాత్త్విక భక్తి పారవశ్యముచే నానంద భరితుఁడై శ్రీమన్నారాయణ నామ
సంకీర్తనము సేయనుపక్రమించు సమయంబున సముద్ర మహారాజు మఱియు నేమను చున్నాఁడనిన.

క. శ్రీపతి పాదాబ్జములే
దాపని యున్నావు కనుక ధన్యుఁడవీవే
యీ ప్రొద్దు కోమలాంగుని
గోపాలునిఁ జూడఁ దెలిసికొంటివి గాదే.

క. ధీరుని శిత పంచశరా
కారుని సతతంబు పూర్ణకాముని భక్తా
ధారుని దశరథరాజకు
మారుని నుతియింపవయ్య మహిజాధిపునిన్॥

కీర్తన కల్యాణి - ఆది

పల్లవి వచ్చును హరి నిన్నుఁ జూడ - మెచ్చును హరి నిన్నుఁ జూచి

అనుపల్లవి కుచ్చిత విషయాదుల - జొచ్చురీతి నెంచి నీవు

హెచ్చుగాను మా స్వామిని - మచ్చికతో నుతియింపుము

చరణ (1): ధీరుని సీతారామావ - తారుని సకల లోకా

ధారుని నిజభక్తమం - దారుని నుతియింపవయ్య

చరణ (2): ధన్యుని వేల్పులలో మూ - ర్ధన్యుని ప్రతిలేని లా

వణ్యుని పరమకా - రుణ్యుని నుతియింపవయ్య

చరణ (3): ఏ జప తపములకు రాఁడు - యాజనాదులకు రాఁడు

రాజిగా నుతియించు త్యాగ - రాజనుతుఁడు ఈవేళ

ప్రథమాంకము సమాప్తము

| | |
|---|---|
| ప్రహ్లాదుఁడు శ్రీహరిని నానావిధంబుల స్తుతి సేయుట | |
| వ. | అంతట ప్రహ్లాదుఁడు సముద్రమహారాజు పలికిన వాక్యంబుల నాలకించి శ్రీహరి<br>ప్రత్యక్షం బగుట కొఱకు స్తోత్రంబు సేయు మార్గం బెట్టులనిన. |
| క. | పెద్దల మాటలవల్లను<br>కద్దని సత్యంబు వరద! కడునమ్మితి నా<br>యొద్దకు రాకుండకురా<br>యద్దపు నెమ్మోముఁ జూడ నలసితిఁ గదరా! |
| దండకము. | శ్రీభక్త హృత్తాప గాఢాంధకారాయుతార్క ప్రభాకార దివ్యంబు<br>నేత్రోత్సవంబౌను నీరూపుఁ జూపించు రామ ప్రభో నీవనేకాండ కోట్లన్!<br>విధీంద్రాది దేవాసుర స్థూల సూక్ష్మంబులన్ నీవు పుట్టించి కాపాడి<br>నష్టంబు సేయన్ సదా మూడు రూపంబులన్ దాల్చి లోకేశుఁడై, విష్ణువై,<br>రుద్రుఁడై చాల లీలా వినోదంబులన్ చేయ మర్త్యుల్ సదాషణ్మతంబైన<br>కూపంబులోఁ బుట్టి కామాది షడ్వర్గ కృత్యంబులన్ సల్పి గర్వాచలా<br>రూఢులై చాల దారార్భకాగార గోబంధులోకంబులం జూచు<br>చుప్పొంగుచుం గుక్షి పూర్ణంబు సేయంగ లేకెప్పుడున్ దుఃఖ వారాశిలో<br>మగ్నులౌ వారు శ్రీరామునింజేరు నారాజ మార్గంబులన్ స్వప్నమందైన<br>సాధింపలేరయ్య నే నమ్మినానయ్య రావయ్య నాయొక్క భాగ్యంబు నీవంచు<br>నున్నాను శ్రీత్యాగరాజార్చితా ఖండలాద్యష్ట దిక్పాల సంసేవ్య<br>మాంపాహి మాంపాహి మాంపాహి॥ |
| క. | వందనము దశరథాత్మజ<br>వందనమిదె నీకు భక్తవత్సల దేవా<br>వందనము లోకనాయక<br>నందకధర పరమ పురుష నారదవినుతా॥ |
| కీర్తన | శహాన - ఆది<br>పల్లవి వందనము రఘునందనా సేతు - బంధనా భక్త చందనా రామ<br>చరణ (1): శ్రీదమా నాతో వాదమా నే - భేదమా ఇది మోదమా రామ<br>చరణ (2): శ్రీరమా హృచ్చారమా బ్రోవ - భారమా రాయబారమా రామ<br>చరణ (3): వింటిని నమ్ముకొంటిని శర - ణంటిని రమ్మంటిని రామ<br>చరణ (4): ఓడను భక్తి వీడను ఒరుల - వేడను నీవాడను రామ<br>చరణ (5): కమ్మని విడె మిమ్మని వరము - కొమ్మని పలుకరమ్మని రామ<br>చరణ (6): న్యాయమా నీకాదాయమా ఇంత - హేయమా మునిగేయమా రామ<br>చరణ (7): క్షేమము దివ్యధామము నిత్య - నేమము రామనామము రామ<br>చరణ (8): వేగరా కరుణాసాగర శ్రీ - త్యాగరాజ హృదయాగారా రామ |
| క. | నా మొరవిని బ్రోతువంచు |

నేమంబున మదిని దలచి నెరనమ్మితినే
సామజ వరదా నాయెడ
వేమరు నీ కరుణరాని విధమేమోగా॥

వ. ఈలాగున ననేక విధంబులు స్తోత్రంబులు సలుపఁగ శ్రీహరి ప్రత్యక్షంబు గాలేదని ప్రహ్లాద స్వామి యత్యంత వ్యసనా క్రాంతుడై పలుకు మార్గం బెట్టులనిన.

ద్వి. ముజ్జ గంబుల కాది మూలమై పరగు – సజ్జన హృత్పద్మ సదనుని కృపను॥
సకల సంపద్భోగ సామ్రాజ్యములను – బ్రకటముగాఁ బొంది ప్రఖ్యాతి గలుగు॥
కనక కశ్యపుదైత్యు కడుపునఁ బుట్టి – దిన దినమున బుద్ధి దెలిసిన నాఁడు॥
వాజి గజాదుల వైఖరుల్ గలిగి – రాజ భోగములను రమియించు జనుల॥
కనుగొని హరిపాద యుగ్మమును – నెనరున ధ్యానించి నేఁ జూచుచుంటి॥
శుభశోభనములచే శోభిల్లి మఱియు – విభవంబుచే జనుల్ వెడలంగఁ జూచి॥
ఆవేళ హరిమయంబనుచు నా మదిని – ధావన సేయుచుఁ బలు మారునుంటి॥
నామది శోధింప నా తండ్రి నాకు – పాములఁ గఱిపించి భద్రేభములను॥
మేనునఁ గ్రుమ్మించి మిగులఁ గోపమున – దానవుల్ చిచ్చునఁ దగిలించునట్టి॥
పరిపరి విధముల బాధలనెల్ల – హరి లీలలనుచు నేనపుడెంచుచుంటి॥
ఇంతకు శ్రీహరి హృదయంబు కరిగి – చెంతకు రాఁడాయెఁ జెలువొంద నేఁడు॥

వ. మఱియు నతి చింతాక్రాంతుడై చింతించు టెట్టులనిన.

ఉ. నా మది కోర్కెలెల్ల రఘునాథుడు తామది నేల యెంచఁడో
నే మొరవెట్టగాఁ దెలిసి నేర్పున ముంగల నేల నిల్వఁడో
రామునిఁ జూడ నామనసు రాయిడిఁజెంది కరంగునట్లుగాఁ
దామరచూలి నానుదుటఁ దప్పక క్రూరపు వ్రాత వ్రాసెనో॥

క. పరులకు సాధ్యంబగునఁట
యరిషడ్వర్గములఁ దగిలి యాసించితినే
తరుఫల మందని చందము
హరియెచ్చట నేను నేడనని చింతించెన్॥

కీర్తన ఘంటా – ఆది

పల్లవి ఎట్ల కనుగొందునో – శ్రీహరిని నే

అనుపల్లవి చుట్లరగడియ దోవకు నామదిలోని
జాలిదెలిసి విభునితోఁ దెల్పువారి

చరణ (1): ధరలో వెలయు సంపదల రోసి తనువును
మఱచి హరినిఁగూడే మహారాజులకుఁ గాక

చరణ (2): మలయుని మదమునఁ దెలియకుంటిని కాని
యలనాఁడే సదయుని ననుసరించక పోతి

చరణ (3): చిన్నప్రాయమునాఁడె శ్రీహరిపై నానఁ
గొన్న జీవుఁడఁగాను కోదండపాణి నే

చరణ (4): ఈజన్మ వీఁభాగ్య వీసొమ్ములెల్ల ప్ర
యోజన మాత్యాగరాజ వినుతుని నే

వ. ఈలాగు నత్యంత ప్రేమావేశములు గలవాఁడై యతిదీనుఁడగు ప్రహ్లాదస్వామి తిరుగ నేమనుచున్నాఁడనిన.

సీ. తల్లి గర్భములోన దగిలి నేనుండగా – నిల మౌని నిజమర్మమేల తెలిపె
నున్నతంబున నుండి యురివిఁ బడవేయ – నీ భూమిదేవి నన్నేలఁ బట్టె

హరినిఁ గానని దేహమని యబ్ధిలోవేయ - నీ సాగరుండు గట్టుకేలఁ దెచ్చె
గోముఖవ్యాఘ్ర భంగుల నన్నుఁ గొనియాడి - యీలాగునను నిల్పిరేల యిచట
నెందుకీరీతి మరులైతినిపుడు హరికి - నెవరితోఁ దెల్పుదీవేళ నేమిసేతు
జీవుడీమేను కాసించి చిక్కికొనెను - ఈశుఁ గనలేని జన్మంబు నిలకుమోఁత॥

కీర్తన పున్నాగవరాళి - చాపు

పల్లవి ఇందుకా యీ తనువును సాకిన

అనుపల్లవి ఇందుముఖుఁడు రాక - హృదయము పగులఁగ

నందరిలో జాలిజెంద నీయని యంద

చరణ (1): పాములకే మేను పలుగట్టిగా నుండ

నేమో కారణమని యెంచుచు నుంటినే

చరణ (2): మనకేల నెపమని మన్నించిరో లేక

తనువు బెల్లముగాదు తాళదు దైవము

చరణ (3): నాజపమును జూచి నమ్మరే దేవుని

రాజిల్లు శ్రీత్యాగరాజ వరదుఁడు తా

వ. ఇచ్చట నీలాగున ప్రహ్లాదస్వామి మొరలిడుచున్న సమయంబున సనక సనందనాదుల యొద్దకు శ్రీనారద గురుస్వామి వేంచేసి యర్ఘ్యపాద్యాదులు గైకొని అత్యంత హర్షముతో ప్రహ్లాదుని వృత్తాంతము పలుకు టెట్టులనిన.

ద్వి. సనకాది మునులార సౌఖ్యాత్ములార - మనవిని వినరయ్య మధువైరియందు॥
జ్ఞాన వైరాగ్య శృంగార సద్భక్తి - మానక విజ్ఞాన మర్మంబు దెలియు॥
జ్ఞాన వంతుండని ఘనముగా వెలయు - మానవునెచ్చోట మౌనీశ మేము॥
కానలేమని మీరు కడఁగి పల్కితిరె - కానఁ బల్కుదునిదె కలతీరు వినుడు॥
భువిని ప్రహ్లాదుండు బుద్ధిమంతుండు - అవివేకముల నెల్ల నణఁచ యోగ్యుండు॥
హరినిఁ గానకను తా నారడిఁ జెంది - మఱి మఱిఁ జింతింప మాధవుం డెఱిగి॥
విహితమౌ భక్తుని వెతలన్ని దీర్చి - మహిమలన్నియుఁ జూపి మన్నన సేయ॥
మహికేగునని తోచె మది హర్షమునను - సహితమై పోదము సానందముగను॥
అనుచు నారదమౌని యట వారిఁ జూచి - వినయంబుతోఁ బల్కి వేంజేసె సభకు॥

వ. అంతట నారదమౌని హరిగుణ మహిమానంద జలధిలో వల్లకియను తెప్పనుఁ బట్టి యీదుచు శ్రీమన్నారాయణ స్మరణఁ జేయుచు శ్రీహరి సభకు పోవువేళ నిచ్చట ప్రహ్లాదస్వామి యేమనుచున్నా డనిన.

క. కోరిన దేవునిగానక
యేరీతిన్ జపముతపము లేమోయనుచు
న్నారామ మందుఁ బొలరఁగ
దూరపు నాదంబుఁ జెవుల దురమున వినియెన్॥

వ. ఇవ్విధంబున ప్రహ్లాదుఁడు నారద వీణా నాదమును విని యే మనుచున్నాడనిన.

సీ. ఈవేళఁ దనకోస మీదేశమునుఁ గోరి - యేలవత్తురు పెద్దలింపు మీఱ
నామీఁద దయయుంచి నన్నాదరించెడు - వారున్న నిందిరావరుఁడు రాఁడె
తన వారలము కామె ధనజన తరుణుల - సుఖహీనుఁడని పైనసూయకాక
రాముని భక్తులై రక్షింప వచ్చిన - జయముదెల్పను ఇంతజాలమేల
సర్వ కాలంబునే సత్యసంధుఁడైన - వేల్పులెవరైన ననుఁ బ్రోవ వెడలియున్న
నాద మీవేళ సముఖంబున రాదె - పరమ కల్యాణ వైకుంఠ వాస, వరద॥

కీర్తన

కీర్తన భైరవి - చాపు

పల్లవి నిజమైతే ముందర నిలువుము ఈ వేళ

అనుపల్లవి అజుడైన హరిహాయుఁడైన నాభక్తియు

చరణ (1): గాసి చెందుచు నేను గర్భములోనుండ - దేశిక వరుఁ డుపదేశించినదెల్ల

చరణ (2): ఉన్నతమున నుండి పడద్రోసినవేళ - నుర్వీదేవి నన్నెత్తి బ్రోచినదెల్ల

చరణ (3): నాగ నాగములు నను బాధించగ - త్యాగరాజనుతుఁడు నన్నుఁ గాచినదెల్ల

వ. ఇవ్విధంబున ననేకవిధంబులుగ బల్కు శపథంబులను విని
నారదమౌని ప్రహ్లాదు నొద్దకు నతిత్వరితముగ వేంచేయునది యెట్టులనిన.

క. తెల్లని దేహముతోఁ గర
పల్లవమున వీణమెరయ బరమాత్మునిఁ దా
నుల్లమున దలఁచి సొక్కుచు
సల్లాపముతోడ మౌని సరగున వెడలెన్॥

కీర్తన పంతువరాళి - చాపు

పల్లవి నారదముని వెడలిన సుగుణాతిశయము వినరే

అనుపల్లవి సారెకు శ్రీహరి పదసారసముల ధ్యానించుచు
నారాయణ నామములనుఁ - బారాయణ మొనరించుచు

చరణ (1): భేదా భేద రహితమగు - వేదాంత రసభరితుఁడా
హ్లాదము మీఱఁగను ప్ర - హ్లాదునకు శుభము దెలుపను

చరణ (2): కడు తెల్లదేహమునఁ బ - సిడి వీణమెఱయఁగఁ దా
నెడబాయని ప్రేమతో - నడుగడుగుకు వాయించుచు

చరణ (3): రాజిల్లిన శ్రీత్యాగ - రాజసఖుని మర్మములను
ఈజగతిని విన్నవారి - కే జయము జయము జయమని

వ. ఈలాగున ప్రత్యక్షమైన శ్రీమన్నారద గురుమూర్తినిఁ జూచి ప్రహ్లాదుండు అత్యంతభక్తి
విశ్వాసముతో సాష్టాంగముగా నమస్కరించి నుతిఁజేయు మార్గం బెట్టులనిన.

ద్వి. అష్టాంగయోగీశ అమరేశ సన్నుత - సాష్టాంగముగ మ్రొక్కి సన్నుతింతుఁ॥
గష్టముల్ తొలగెను కన్నప్పుడే మిమ్ము - నిష్టముల్ చేకూరె నిపుడు తనకు॥
దుష్టులు మిముఁజూచి దూరమౌదురు గదా - తుష్టుఁడైతిని బ్రహ్మనిష్ఠసుగుణ॥
సృష్ట్యాది కర్తయౌ శ్రీవల్లభునిఁగూడి - నిష్ఠతో వెలసెడు నిర్మలాత్మ॥
గోష్ఠి వినవయ్య నాలోని కోర్కెలెల్లఁ - బుష్టియవునట్లు సేయవే పూజనీయ॥
యిష్టుఁడౌ జగదీశుని నిపుడు జూడ - శ్రేష్ఠుఁడౌ నిన్ను నేనమ్మి చెప్పుకొంటి॥

ఉ. నారద నీకు వందనము నాఁడుపదేశముచేత ధన్యుఁడన్
వారము విఘ్నషకే తనువు వంచనలేకను నొప్పగించుచున్
కోరితిఁ గన్నులారఁ గన కోమలదేహుఁడు చెంతరాక నే
నారడిఁ జెందినాను దన యార్తిని దీర్చ విరించినందనా॥

వ. ఈలాగు తన మనోరథముఁ దెల్పిన విని ప్రహ్లాదునిఁ జూచి నారదగురుస్వామి యత్యంత
హర్షముతో స్తోత్రము చేయున దెట్టులనిన.

ద్వి. వినవోయి ప్రహ్లాద వివరంబుగాను - తనప్రాయముల నెన్నదరముగా దిపుడు॥
తగనింద్రపట్టముల్ ధాతపట్టములు - అగచాపు ప్రళయంబు లటుచూచినాను॥
కర్మేంద్రియములనుఁ గాలకింకరుల - మర్మముల్ దెలిసి యీ మహిక్రింద నడచి॥
అనయంబు హృదయంబు హరి కొప్పగించి - కనులపండువుగానుఁ గనగోరి ఘనుని॥

| | |
|---|---|
| | గాఢంబుగామదిఁ గౌఁగిటఁజేర్చి - గూఢమునొకటిగా గూడనెంచెడిని॥<br>నీవంటి భక్తుని నిఖిలలోకముల - నేవంక నే గాన నీప్రదేశమున॥<br>బాలక నినుగంటి బాగుమీఱంగ - జాలివిడువు వచ్చు శౌరి యీవేళ॥ |
| వ. | అని పలికి నారదమౌని శ్రీవైకుంఠప్రభావమును బలుకు టెట్టులనిన. |
| చూ ర్ణి క. | జయతు జయతు! సకల నిగమాగమ కుశల కిన్నర కింపురుషసిద్ధ విద్యాధర<br>గీయమాన బహుజగదుదయ రక్షణ లయ హేతుభూత చతురానన హరిహర<br>ప్రభృతి చింత్యమానమణిద్వీపే జిత సాధుహృత్తాపే! సకలసురముని నికర<br>నిజభక్తజన నిచయ హృదయ కామిత సంతాన సౌభాగ్య ధనకనక వాహనా<br>ద్యష్టైశ్వర్యదాయక చింతామణిమయ మహావైకుంఠనగరే! నేత్రానందకరే!<br>చండమార్తాండ విలసిత సప్తహేమ ప్రాకారాంతర శోభాయమాన<br>భాస్కరకోటి సమాన వజ్ర స్తంభాయుత సహిత సువర్ణమంటపాంతరే!<br>శుభతరే! నవరత్నఖచిత కనకమయ హంసతూలికాతల్పే! శరశ్చంద్రకోటి<br>సన్నిభ శేషతల్పే! సురనాయకా ద్యష్టదిక్పాల మకుట మణిగణ నీరాజిత పదారవిందః<br>జగదానందః అనంతగరుడ విష్వక్సేనాది నిత్యసూరిజన సమేత మహాప్రభావసంపన్నః<br>అఖిలభక్తజన ప్రసన్నః ఉభయపార్శ్వోజ్జ్వలిత కర్ణకుండలనిందిత చంద్రమండలః<br>సేవితమునిమండలః! భక్తత్రాణ పరాయణః! శ్రీమన్నారాయణః! లక్ష్మీసమేతో మహాభగవాన్॥ |
| వ. | ఈ ప్రకారము శ్రీవైకుంఠ ప్రభావంబు నభివర్ణించి మఱియు నచ్చట జరిగిన<br>వృత్తాంతంబు ప్రహ్లాదస్వామికి నారదముని యతివివరముగాఁ బలుకు టెట్టులనిన. |
| ఉ. | సారెకు వీణె మీటుచును సన్నుతిచేయుచు నేను నుండగా<br>గూరిమితో గరంగుచు వికుంఠపురంబున నాదిలక్ష్మితో<br>నీరజనేత్రుఁడాడిన సునిశ్చయ వార్తలు విన్నయంతనే<br>సారము నీకుఁదెల్పి మది సంశయమెల్లనుఁ దీర్పవచ్చినన్॥ |
| వ. | ఈలాగున నారదుఁడు పలికిన శుభవార్తలు విని ప్రహ్లాదుండు మితిలేని సంతోషంబున<br>బాష్ప పూరిత లోచనుండై గద్గదస్వరంబునఁ బరవశుఁడై పలుకునది యెట్టులనిన. |
| ద్వి. | నిను సడ్డజేసి తా నళినాక్షితోను - వనరుహాక్షుండు నాదువార్తలు పలుక॥<br>నామాటలకు దల్లియడ్డమాడకను - నామీద దయయుంచి నా ప్రాణవిభునిఁ॥<br>గూరిమిఁ బల్కెనా గురుతరంబుగను - నారదఋషివర్య నగరాజధైర్య॥<br>ఇరువురు నామాటలెత్తిరా మఱియుఁ - గరుణను తలచిరా కడఁప్రేమమీఱ॥<br>ఈ శుభవార్తకు నిది సరిగాదు - వాసుదేవుండు నావద్దనున్నట్లు॥<br>కమ్మని ముద్దిచ్చి కౌఁగిటఁజేర్చి - నమ్మికలిచ్చుచు ననుఁ బ్రోచినట్లు॥<br>నేఁడు నా మనసునకు నిండారు సుఖము - గూడినయట్లాయె గురురాయ శరణు॥ |
| క. | మదనజనకుఁడగు శ్రీహరి<br>మదిలో ననుఁ దలఁచి తలఁచి మన్ననతోడన్<br>సదయాశుఁడగుచు లక్ష్మి<br>వదనము నీక్షించి పలుకు వాక్యము వింటిన్॥ |
| వ. | ఇవ్విధంబగు నా భాగ్యంబేమి తెలుపుదునని ప్రహ్లాదుండు పరమోత్సాహంబున<br>నారద గురువును చూచి మఱియు నేమనుచున్నాఁడనిన. |
| కీర్తన | ఆరభి - చాపు<br>పల్లవి: ఇప్పుడైన ననుఁ దలఁచినారా స్వామి<br>అనుపల్లవి: కృపకుఁ బాత్రుఁడనని - కీర్తించినారా<br>చరణ (1): దయచేసి నామాటలెల్ల నా - తల్లితో బలికిన కొల్ల<br>నయముగ వింటి నీవల్ల నేడు - నామనసుకు నెంతో చల్లనాయె |

చరణ (2): ఉన్నత దయ కాసగొంటి నేను - బన్నములకు బాళైయుంటి
కన్నులార మిముఁగంటి నేడు - కర్ణామృతపు మాటవింటి స్వామి
చరణ (3): పలురూపములు తానుపూని నన్ను - బాధించే వేడ్కఁ జూచెను
పలుమారు నన్ను నే చేయుపుణ్య - పాపము హరిచెంతగాని యేమందు
చరణ (4): భూమినిఁ బుట్టగలేను భూయో - భూయో హరిని నమ్మినాను
తామసమును తాళలేను వర - త్యాగరాజాప్త మదిలోను

వ. ఈ లాగున ప్రహ్లాదుం డాత్మసంతోషము గలవాఁడై
నారదగురుస్వామినిఁ జూచి మఱియు నేమనుచున్నాడనిన.

క. దేశిక! నలుగురిలోఁ బర
దేశిగ నెంచకయు నన్ను దేవుఁడు సతితో
నాశన్ పలికిన వార్తలు
ఆశుగ దెలియంగఁ బలుకు మమరేశనుతా॥

వ. ఈలాగున వైకుంఠము నందు జరిగిన లక్ష్మీహరి
సంవాదంబు వివరంబుగా దెలుపుమను
ప్రహ్లాదునికి నారదగురువు తెరింగింపు మార్గం బెట్టులనిన.

లక్ష్మీం ప్రతి శ్రీమన్నారాయణః (లక్ష్మీదేవితో శ్రీమన్నారాయణుడు)

చ. కలశ సముద్ర రాజవర కన్యక! చిత్రము నాలకింపు భూ
తలమున నిశ్చలుం డొకఁడు దానవపుత్రుఁడు వానిభక్తిచే
వెలపడిపోతి నామనసు వేరుగ మారదికేమిసేతు! నీ
వలె ననుఁ బాయలేఁడు కని వచ్చెదనంచు ప్రయాణ మయ్యెడున్.

వ. అంతట తన్నెడఁబాయ నాలోచించు భగవంతుని
హృదయం బెఱింగి తన చెలికత్తె నీక్షించి
యతిచింతాక్రాంతయై లక్ష్మీదేవి పలుకుటెట్టులనిన.

ద్వి. ఈశ్వరినై పుట్టి యీ కర్మమెల్ల - శాశ్వతమాయెగా సఖియరో వినుము॥
నిన్నటి రాతిరి నిండారగను - మిన్నైన సొమ్ములు మేనెల్లనించి॥
సొగసున నేఁ గాంచి సొక్కుచునుండ - నగధరుఁడావేళ ననుజూచి శిరము॥
ఊచుచు బాగైన యురగతల్పమున - యోచనాక్రాంతుఁడై యుండి దిగ్గునను॥
లేచి నే వేంచేతు లేమరో యనుచు -నేచుచు మాటాడె నేమందునమ్మ॥
పడతిరో సొగసెల్లఁ బానుపుపాలు - పడఁజేసె నిక నోర్వవశమౌనె చెలియ॥
అనుచును నీవార్తలాడిన లక్ష్మి - ఘనుని దాఁ జూచుచు గ్రక్కునఁ బలికె॥

వ. మఱియు శ్రీహరినిఁ జూచి లక్ష్మీదేవి యొకవాక్యము పలుకుటయును,
శ్రీహరి యొకవాక్యము ప్రత్యుత్తర మిచ్చుటయును నెట్టులనిన.

సీ. (లక్ష్మి)
తెలవార ప్రొద్దుగూకులు మీకు నిజదాస - వ్రాతియేలనొ పనుల్ వేరెలేవె
(హరి)
అటువంటి వరభక్తుఁ డరుదారె గాని నీ - వీ మాటలందు వేరెంచ వలదు
(లక్ష్మి)
మాటిమాటికి మీరు మహికినేగుటవల్ల - మదితల్లడిల్లును మదనజనక
(హరి)
ఎన్నాళ్ళ కెన్నాళ్ళ కెవరికోసము నేను - నినుబాసి చనితినో నీరజాక్షి
(లక్ష్మి)
ద్రుతముగానాడు చనలేద ధ్రువుని కొఱకు

| | |
|---|---|
| | (హరి)<br>ఒకఁడు కోటాను కోట్లలో నుత్తముండు<br>(లక్ష్మి)<br>అందుకే నేను నిను బాసి యార్తిఁబడితి<br>(హరి)<br>నింత మాత్సర్య మెందుకే యిందువదన॥ |
| క. | (లక్ష్మి)<br>త్రోవ నెఱింగిన బాలుఁడు<br>భావంబును బట్టుకొన్నఁ బలుకఁటెటులనో<br>(హరి)<br>నా వైనంబుల నేచుచు<br>ద్రోవందే కల్ల సేయ దొరలెను సుమ్మీ॥ |
| వ. | ఇటువలె నమ్మిక బలికి ప్రహ్లాదునొద్దకు బోవుట కుద్యుక్తుఁడైన శ్రీమన్నారాయణునిఁ<br>జూచి లక్ష్మీదేవి మఱియు నేమనుచున్నదనిన. |
| క. | విదారినైన వానికి<br>వాదాడి వరంబొసంగి వచ్చెదనని నా<br>మీఁదానఁ బెట్టి చనుమిక<br>నా దాహము దెలిసికొమ్ము నళినదళాక్షా॥ |
| వ. | ఈలాగున శ్రీవైకుంఠమునందు జరిగెనని ప్రహ్లాదునికి నారద గురుస్వామి పలుకు టెట్టులనిన. |
| క. | సాకేతపురిని నిన్నను<br>శ్రీకాంతుండు కాంతతోడ జింతించెను తా<br>నా కరుణారస వార్తలు<br>ప్రాకటముగ నీకు నేను పల్కితిసుమ్మీ॥ |
| క. | ఈలాగు నడచు వార్తలు<br>బాలక నీ భాగ్యమెల్ల పండాయెనురా<br>నీలోఁ దగిలెను శ్రీహరి<br>యాలోచన సేయనేల అభయంబిదిగో॥ |

ద్వితీయాంకము సమాప్తము.

వ. ఈలాగున ప్రహ్లాదస్వామి శ్రీమన్నారద గురువు పలికిన శ్రీవైకుంఠ వృత్తాంతమంతయు
వినఁగానే పరవశమున సర్వస్వము శ్రీహరిమయమై తోచియుండగ నాలుగు దిక్కులుఁ
గలయ వీక్షించి యింకను శ్రీహరి ప్రత్యక్షము గాలేదని యత్యంత వ్యసనాక్రాంతుఁడై
ప్రలాపించు మార్గం బెట్టులనిన.

సీ. ఆది నెఱుగు మాటలా మౌని తెల్పగ - నడగిన పరితాప మధికమాయె
వ్యసనాగ్నిచేఁ జాలవేగు చుండగ మౌని - వార్తలు నాజ్య ప్రవాహమాయె
హరినిఁ గానని వహ్నినార్ప లేకుండగ - మౌని పల్కులు పవమాన మాయెఁ
దత్తరమందుచుఁ దనువుస్రుక్కుచు నుండ - ముని పల్కు మోహాబ్ధి మునుఁగనాయెఁ
గనులు తెరచినఁ గూర్చిన కంతుజనకు - చాక చక్యంబు చెలగంగ సారసాక్షు
వ్యాతి తలకెక్కి నామముల్ వేవిధాలఁ - దాను దలపోసి పలికెను తాలలేక.

కీర్తన నీలాంబరి - ఆది

పల్లవి: ఎన్నఁగ మనసుకురాని పన్నగశాయి సొగసు
పన్నుగఁ గనుగొనని కన్నులేలే - కన్నులేలే - కంటి మిన్నలేలే

చరణ (1): మోహముతో నీలవారి వాహకాంతినిఁ గేరిన
శ్రీహరినిఁ గట్టుకొనని దేహమేలే - దేహమేలే - ఈగేహమేలే

చరణ (2): సరసిజ మల్లె తులసి విరజాజి పారిజాత
విరులచేఁ బూజించని కరములేలే - కరములేలే - ఈ కాపురములేలే

చరణ (3): మారిమిని త్యాగరాజునేలిన రామమూర్తిని
లాలించి పొగడని నాలికేలే - నాలికేలే - సూత్రమాలికేలే

వ. ఇవ్విధంబున ప్రహ్లాదస్వామి తిరుగఁ జింతించునది యెట్టులనిన.

ఉ. శ్రీవసుధాధినాథ సుర సేవిత దివ్య పదారవింద యో
దేవ భవత్పదాంబుజము దిక్కని నా మదిలోన నమ్మి నీ
సేవకు దోసిలొగ్గి మది చింతయొనర్చిన వాఁడగాన నా
భావ మెఱింగి నీదు ముఖపంకజముం దగఁ జూపవే హరీ.

ఉ. శ్రీధర! రామచంద్రముని చింతిత పాద సరోజ! శ్రీహరీ!
మాధవ! మారకోటి నిభ! మంగళదాయక! మంజభాషణా!
ఓ ధనవీర! వీరవర! యోగి హృదాలయ! నన్నుబ్రోవవే!
నాథ! సురోత్తమాకృతిని నారద సన్నుత వేగఁ జూపవే.

వ. ఈలాగున నతి చింతా క్రాంతుండై కఱఁగుచుఁ బలుకుటెట్టులనిన.

కీర్తన వరాళి - చాపు

పల్లవి: ఏటి జన్మమిది హా ఓ రామ

అనుపల్లవి: ఏటి జన్మమిది యెందుకిఁ గలిగెను
యెంతని సైరింతు హా ఓ రామ

చరణ (1): సాటిలేని మారకోటి లావణ్యుని

మాటిమాటికిఁ జూచి మాటలాడని తన

చరణ (2): సారెకు ముత్యాల హార మురము పాలు

గారు మోమును గన్నులారఁ జూడని తన

చరణ (3): ఇంగితమెఱిగిన సంగీతలోలుని

పొంగుచుఁ దనివార గౌగిలించని తన

చరణ (4): సాగరశయనుని త్యాగరాజనుతుని

వేగమె చూడక వేగెడి హృదయము తన

వ. ఈలాగున ననేక విధముల మొరపెట్టియు శ్రీహరి దర్శనము
లేదని యతిచింతాక్రాంతుఁడై పలుకునది యెట్లనిన.

క. కరివరదుని గన గోరుచు
గరగుచు గన్నీరునించి కలఁడో, లేఁడో
హరిహయ బ్రహ్మాదులకును
హరియగ పడువాఁడుగాఁడె యని మూర్ఛిల్లెన్.

వ. ఇవ్విధంబున ప్రహ్లాదుండు ప్రపంచమంతయు మఱచి మూర్ఛఁజెంది యుండు సమయంబున.

ద్వి. అణురేణువుల యందు నచలంబులందు – నణఁగి చెలఁగుచు నుండు నాదిదేవుండు॥
ఆద్యంతరహితుండు నమలుండు వేద – వేద్యుండు నిజభక్తు వ్యసనంబుఁ దెలిసి॥
హొంగారు జలధిలోఁ బొందుగా నడుమ – బంగారు చవికెలో బాగుగానుండు॥
శృంగారి లక్ష్మిని శ్రీహరి మఱచి – రంగైన వస్త్రంబు రాపాడుచూడ॥
మాణిక్యమయమగు మకుటంబు కదల – నాణి ముత్యపు సరు లసియాడ మిగుల॥
చిన్ని మోమునఁ జిరు చెమటలూరంగఁ – బన్నీరు గంధంబు పరిమళింపంగ॥
వసుధపైఁ బవళించి వాడియున్నట్టి – యసుర పుత్రుని చెంత క్షణమునందు॥
అత్యంత ప్రేమతో నంకమందుంచ – సత్యవంతుని జూడ శౌరి తా వెడలె॥

వ. ఈలాగున అఖిలాండకోటి బ్రహ్మాండ నాయకుఁడు శ్రీమన్నారాయణుండు అత్యంత
కృపాళుఁడై శ్రీవైకుంఠము నుండి వేంచేయు వైభవమెట్లనిన.

ఉ. శ్రీవనితామనః కుముద శీతకరుండతి మోదయుక్తుఁడై
పావన మూర్తి తా నసుర బాలుని భావ మెఱింగి వేగమే
భావజ కోటికోట్ల నిజ భాసురమెల్లను గోటఁజూపుచు
న్నీ వసుధా తలంబునకు నీశ్వరుఁడేగు విధంబు జూడరే.

క. శ్రీమదనే కాండములను
ప్రేమనుఁ గాపాడు హరిని ప్రేమముతోడన్
నామామృత పానంబుల
నేమముతోఁ జేసికొంచు నేర్పునఁ గనరే.

కీర్తన సౌరాష్ట్ర – చాపు

పల్లవి ఎంతనుచు వర్ణింతునే యీ – యిందిరా రమణుని నే

అనుపల్లవి సంతతము నమ్ము సజ్జనుల యీ – సంత తీర్పు వసంత కుమారు

చరణ (1): మెఱుగు బంగరు చేల మిరవొంద మఱియు నూపురములు ఘల్లనఁగ భక్తులఁగని

కరుణామృతము చల్లగ యోగుల దహరములు ఝల్లనఁగ వేంచేసిన

చరణ (2): తిలకము చెలగఁగ జలజాక్షుఁడిలకు క – దలు రీవి వినిపింపఁగ తుంబురు నార

దులు కని నుతియింపఁగ సురలు సుమ – ముల వాన గురియింపఁగ వేంచేసిన

చరణ (3): ఘననీలమునుఁ గేరు తనువుపై బునుగు చం - దనము పరిమళింపఁగ బాగు ఉర
మున ముక్తామణులాడగ త్యాగరాజుఁ - గని చేలావియ్యగ వేంచేసిన

వ. ఈలాగున శ్రీహరి యత్యంత దయతో వేంచేయు సమయంబున ప్రహ్లాదునిఁ
జూచి పలికినది యెట్టులనిన.

క. పుడమిచెలిమగడు తాళక
కడు వడిగా నడచివచ్చి కరుణాయుతుఁడై
జడియకుమని ప్రహ్లాదుని
నుడుపతి ముఖుఁ డప్రమేయుఁ డురమునఁ జేర్చెన్.

వ. ఇవ్విధంబున నడలి బడలి హరిగుణముల పాడి వాడి మేను చిక్కి సొక్కి సోలియున్న
ప్రహ్లాదస్వామి నిస్సంగుఁడైన శ్రీరంగనాథుని శుభాంగ సంగము చేత మూర్ఛదెలిసి
తన యంతరంగమున యోచించునది యెట్టులనిన.

సీ. శ్రీలక్ష్మికైననుఁ జిక్కని యంకంబు - హరియు భక్తునకిచ్చి యాదరించె
నా సుఖంబులచేత నార్తులెల్లనుఁ దీర - నేఁడు భాగ్యంబని యాడుకొనుచుఁ
గడు దీర్ఘబాహుని కమలాయతాక్షుని - గమనీయవదనునిఁ గనుగొనంగ
నాశ్చర్యమొకవంక హర్షంబు నొకవంక - గడుభయంబొకవంకఁ గల్గునటుల
నింతసౌఖ్యంబు లెటుగల్గెనిపుడు తనకు - చింతచేఁ గుంది మూర్ఛిల్లు చిత్తభరమొ
స్వాంతమందునఁ గన్నట్టి స్వప్నమేమొ - యనుచు ప్రహ్లాదుఁడీరీతి నాడుకొనెను.

వ. ఇటువలెఁ బలికి ప్రహ్లాదుండు యేలనిట్టి భ్రమలు జెందినానని సాక్షాత్కరించిన
శ్రీహరి నేత్రానందముగ సేవించి నిశ్చయించున దెట్టులనిన.

క. ఇదిగో శ్రీహరి వారిధి
యిదిగో భూమ్యంతరిక్ష మిదిగో
ఇదిగో స్వప్నముగాదిది
యిదిగో నను గౌరవించె నిదె ధన్యుండన్.

వ. ఇవ్విధంబున నిశ్చయించి తన మనంబున గోరుచున్న మహాభాగ్యంబుఁ గొనసాగెననుచు
బ్రహ్మానంద జలధిలో నోలలాడుచుఁ బరవశుండై యున్న వివరంబెట్టులనిన.

సీ. హర్యంక కరసౌఖ్య మనుభవించుటచేతఁ - బూర్ణుఁడై యా బాహ్యబోధలేక
విస్మయంబులవల్ల వికసింపఁ గన్నులు - హర్షంబుపట్టక యట్టె కూర్చి
యానంద మూర్ఛచే నంత యింతని లేక - యాద్యంతరహితుని హరినిఁ జూడ
చిత్తషట్చరణంబు శ్రీమాధవ ముఖాబ్జ - మాధుర్యములచేత మలయుచుండఁ
దనువు సర్వోన్నతంబైన దశనుఁ గూడ - దొరకరానట్టి భాగ్యంబు దొరికెననఁగ
బుద్ధి యానంద పరవశంబునను తగుల - నసురపుత్రుఁడు నపరాధమనుచు మ్రొక్కె.

వ. అంతట ప్రహ్లాదుండు దిగ్గునలేచి జగన్మోహనాకారుని, జగద్గురుని, శంఖచక్ర
శార్ఙ్గనందక గదా పంచాయుధ ధరుని శరణాగతసులభుని, పుండరీకాయతాక్షుని,
పురాణపురుషుని, నవరత్నఖచిత కుండల దీపిత సుందర గండస్థలుని, నారాయణుని,
సకల దిక్పాల మకుటవిరాజిత పదారవిందుని, సార్వభౌముని, శ్రీవత్సాంకిత వక్షఃస్థలుని,
సీతామోహన విగ్రహుని, నాజానుచతుర్బాహుని, ననంత గరుడ విష్వక్సేనాది సపరివారుని,
నాద్యంతరహితుని, నవ్యపీతాంబరధారిని, నతజనార్తహరుని, నవ్యాజ కృపాసాగరుని,
నచ్యుతుని, ననిర్వాచ్యచరితుని, నఖిలాండకోటి బ్రహ్మాండ నాయకుఁడగు శ్రీమన్నారాయణమూర్తిని
సేవించి స్తోత్రంబు సేయు మార్గం బెట్టులనిన.

సీ. సర్వలోకాధార శాశ్వతాగమసార - ధరసుతారమణ వందనము నీకు
సర్వోపనిషదర్థ! సారసదళనేత్ర! - తరణికోటిసమ! వందనము నీకు!
నెవ్వరిభాగ్యమో యెందున దాగితో! - యెందు గౌగిలిఁజేర్తు నేమిసేతు!

సింతముద్దంత రివంత ధరితనంబు! – నల్పచిత్తులకల్ల నరుడు కానఁ!
గంటి తొల్లింటి పుణ్యంబు కన్నులార – నిదియ భాగ్యంబు నిపుడు తనకు
ననుచు నానందజలధిలో నట్టె మునిగి – వదరి హరిపాద కమలముల్ పట్టుకొనెను.

వ. ఈలాగున శ్రీహరి పదముల బట్టుకొని ప్రహ్లాదుండు పలుకునది యెట్టులనిన.

కీర్తన భైరవి – ఆది

పల్లవి ఏనాటి నోము ఫలమో – ఏ దాన బలమో

అనుపల్లవి శ్రీనాథ బ్రహ్మకైనను నీదు సేవ దొరకునా తనకు గలుగుట

చరణ (1): నేను గోరిన కోర్కులెల్లను నేఁడు తనకు నెరవేరెను
భానువంశతిలక నా పాలి భాగ్యమా సజ్జన యోగ్యమా తన

చరణ (2): నీదు దాపు నీదు ప్రాపు దొరికెను నిజముగా నే నీసొమ్మైతిని
ఆదిదేవ ప్రాణనాథ నా దంకముననుంచి పూజించ తన

చరణ (3): సుందరేశ సుగుణబృంద దశరథనంద నారవిందనయన పావన
అందగాఁడ త్యాగరాజనుత సుఖమనుభవింప దొరకెరా భళి తన

వ. ఈలాగున పలికి ప్రహ్లాదుండు తిరుగ స్మరణ దర్శనానంద జలధినీదుచు
బలుకునది యెట్టులనిన.

క. తిరుగానందాంబుధిలో
బరమాత్ముని దన్నుమఱచి పరవశతను తా
హరి హరి హరి యనుచుండగ
వరదుఁడు తారకముఁబట్టి వార్తలు పలికెన్.

తృతీయాంకము సమాప్తము.

| | |
|---|---|
| వ. | అంతట బ్రహ్మానంద జలధిలో నోలలాడుచున్న ప్రహ్లాదునిఁ జూచి యతని చిత్తశుద్ధి<br>లోకులకుఁ దెలియఁ జేయుటకై తలఁచి నిజ భక్తజన సంభాషణమందు నాసగలవాఁడై<br>శ్రీమన్నారాయణమూర్తి పలుకున దెట్టులనిన. |
| శ్లో. | అరసికజన సంభాషణాత్<br>రసికజనేషు వాక్కలహః శ్రేయః ॥ |
| క. | తలపున మోక్షదుఁడగుచును<br>వెలుపటి కా శుద్ధిగలిగి వేడుకగాగన్<br>తెలియని లోకులకెల్లను<br>జెలరేగుచు వాదులాడఁ జక్రియు దలఁచెన్. |
| వ. | శ్రీహరి ప్రహ్లాదునిఁ జూచి పలుకు వాక్యం బెట్టులనిన. |
| ఉ. | ఎప్పుడు పూర్ణకామి సుఖి హెచ్చుగ వేల్పుల కాదిమూలవై<br>చెప్పతరంబుగాదు తన చేతన జన్మములే మతజ్ఞాలో<br>గొప్ప తపంబొనర్చుచును కోర్కెల నిమ్మన సంతసిల్లుచున్<br>తప్పక నిత్తు సంపదలు దానవ పుత్ర వరంబులందుకో. |
| వ. | ఈలాగున శ్రీమన్నారాయణుఁడు ప్రహ్లాదునిఁజూచి కామ్యవరము లందుకొమ్మనిన<br>వార్తలు విని సహింపక యెదురు పలికినది యెట్టులనిన. |
| క. | ఆనాటి దాహమెల్లను<br>నేనార్చగ నిన్నుఁజూచి నేర్పునమదిలో<br>బానకపు పుల్లరీతిని<br>హీనంబగు వార్తఁబలుక నిది సమయంబా. |
| క. | సదయామర తరువునుఁ గని<br>ముదమునఁ బొక్కడుగఁ బోవు మూఢుఁడు గలఁడా<br>మొదలైన వేల్పు లెఱుఁగని<br>పదములఁగని విడువఁజాలఁ బదిమారులకున్. |
| వ. | ఇవ్విధంబున బలికి తిరుగ శ్రీహరినిఁ జూచి పలుకుటెట్టులనిన. |
| క. | స్వల్పము లడుగనుఁ జూచుట<br>కల్పాంతరమైన తృప్తిగాదయ మదిలోఁ<br>గల్పన చాలు బిలేశయ<br>తల్పామర వినుత! బ్రోవు తాళను నేనున్. |
| కీర్తన | శంకరాభరణము - త్రిపుట<br>పల్లవి నన్నుబ్రోవకను - విడువనురా రామ<br>చరణ (1): కాసును వెతుకగ గన్న రత్నమురీతి<br>దోసము తొలగింప దొరికితివికాని<br>చరణ (2): అంబలిఁ దినువేళ నమృతమబ్బిన రీతి |

తుంబురు సన్నుత దొరికితివికాని

చరణ (3): చెయ్యలసినవేళ దెప్పదొరికినరీతి

నయ్యా నా పాలిటి కమరితివికాని

చరణ (4): ఆడబోయిన తీర్థమెదురైనరీతి

నీడు జోడులేని యిష్టుడవైతివి

చరణ (5): సిగ్గుపోవువేళ చీరలిచ్చినరీతి

నొగ్గి మాయింటికి వచ్చితివికాని

చరణ (6): ఆగమ నిగమ చయార్థము నీవని

త్యాగరాజనుత తలచియున్నాను

వ. ఈలాగునఁ బలికిన ప్రహ్లాదునిఁ జూచి దృఢభక్తిగల మనస్సును
శోధించుటకై శ్రీహరి పలుకుటెట్టులనిన.

ఉ. నాయెడ నాసగాని మది నాలుగు లోకములెల్ల సత్యమే
నీయెడఁ బ్రేమగొంటి నిది నిశ్చయమే ననుఁజూచి లబ్ధమే
మాయెను? ఏది యేదనగ మర్తులు లేదన నీవు నవ్వరా?
చాయగు కీర్తిగాదు మనసారగ నిత్తు వరంబులందుకో.

వ. ఇవ్విధంబున ప్రహ్లాదుని మోహింప జేయుటకై శ్రీహరి తిరుగఁ బలుకునది యెట్టులనిన.

క. ఎడలేని ప్రేమగొంటిని
కడు భక్తియు నీకుఁ గలదు కలదని తానే
యెడియాసఁ జూపి భవమున
వడిగా మోహింపఁ జేయు వార్తలు పలికెన్.

కీర్తన ఆరభి - చాపు

పల్లవి అడుగు వరముల నిచ్చేను

అనుపల్లవి అడుగడుగుకు నిన్నే దలచుకున్నాను - అద్భుతమైన భక్తికి సొక్కినాను

చరణ (1): ధనకనకములు ఎన్నైన నీకు - దారపుత్రులు సొగసైన యిండ్ల

చనువున నొసగుదు సంశయమేల - తనువు చిక్కఁగనేల దానవబాల

చరణ (2): అక్రమ దనుజులఁ గొట్టి నీ - యాపదలను తలమెట్టి

విక్రమమున బహు విఖ్యాతిగా విధి - శక్రాదుల పట్టముల నొసగెదు

చరణ (3): వాజి గజాందోళికములు నీకు - వరమైన మణి భూషణములు

రాజిగ నొసఁగక రవ తాళలేను - వరత్యాగరాజాప్తుఁడ నేను

సనకాదయః ॥ మాయామోహాకరీ ॥
(సనకాదులు "మాయామోహాకరీ" అను కీర్తన పాడుదురు)

వ. ఇటువలె వంచనగాఁ బలికిన ప్రపంచనాథుని పలుకులువిని సైరింపక
ప్రహ్లాదస్వామి పలుకునది యెట్టులనిన.

క. పామరులనుఁ బలుకుము మఱి
సామర్థ్యములెల్ల నీవు సాగరశయనా
నే మఱువను చరణంబులు
నా మనసుకు సొమ్ము నీవు నళినదళాక్షా.

వ. ఇటువలె బలికి తిరుగ శ్రీహరినిఁ జూచి పలికినది యెట్టులనిన.

కీర్తన కేదారగౌళ - ఆది

పల్లవి వారిజ నయన నీవాఁడను నేను - వారిజానన బ్రోవు

అనుపల్లవి సారెకు మాయా సాగరమందు - నేరక మునిగే నేమము లేదు

చరణ (1): ధనకనకములను దారపుత్రులఁ గై - కొని మఱవను రవితనయుఁడ గాను

చరణ (2): వాజి రథములను వారము కైకొని - రాజులనడచు పార్థరాజా నే గాను

చరణ (3): నీజపములు నవనిధులౌ త్యాగ - రాజవినుత యీ దురాశలఁ దగలను

క. ఏపాటి భవసుఖంబులు
నీ పాద సరోజభక్తి నిజముగ నిమ్మా
కాపాడు నీదు భక్తుల
వ్యాపారము సేయలేక వేసారితివా?

వ. ఇవ్విధంబున సకలమైన యైహికభోగాదులయందు నిస్పృహ భావంబున బలికి మఱియు
నాత్మజ్ఞానానందమయుండగు ప్రహ్లాదుండు శ్రీహరినిఁ జూచి పలుకుటెట్టులనిన.

క. ఓపిక చేతను వెలిగేఁడి
యీ పంచాత్మకపుమేను నీలోకంబున్
ప్రాపనుకొనదే మది నీ
కాపట్యములెల్లఁ దెలిసి కదలను సుమ్మీ.

కీర్తన దేవగాంధారి - ఆది

పల్లవి తనలోనే ధ్యానించి తన్మయమె కావలెరా

అనుపల్లవి తన గుహలోఁ దానుండె - తావునుఁ దెలియఁగవలెరా

చరణ (1): నీ మర్మ మాక్షణమే - నిశ్చయమై తెలుసునురా

చరణ (2): ఏనను మాయావేశ - నేవంకో తెలియదురా

చరణ (3): తొలికర్మమే బలము - తోయకూడదు విధికి

చరణ (4): ప్రకృతి స్వభావములు - ప్రజ్వలించుచు నుండు

చరణ (5): లక్ష్యముచేయరు మదిలో - లక్షాంతరములకైనా

చరణ (6): మ్రింగిన కళ్ళను రుచుల - మేలుగనేవారెవరు

చరణ (7): భూతములైదును నీవు - హొరలచేయుచున్నావు

చరణ (8): నిరవధి శయ్యపై నీవు - నిత్యానందమున నున్నావు

చరణ (9): శ్రీత్యాగరాజుని చేపట్టి రక్షించేవు

వ. ఇవ్విధంబున బ్రహ్మజ్ఞాన నిష్ఠుడై పలికిన ప్రహ్లాదునిఁ జూచి
పరబ్రహ్మమైన శ్రీమన్నారాయణమూర్తి పలుకునది యెట్టులనిన.

సీ. మాయల దేహాభిమానంబుల జయించి - వర్ధిల్లునట్టి నీవంటివాని
గని యభీష్టములిచ్చి కరుణతో భువి - చక్రవర్తిగాఁ జేసి నే వరములిత్తు
స్వల్పమైనట్టి యాస్వర్గ భోగములకై - భువిలోన జపతపంబుల నొనర్చు
కామార్థులకు నేను కలనైనఁ గాని కన్ప - డను పామరులకేపాటి వినుము
బాల సతతంబు నీ రాజ్య పాలనంబు - సల్పఁగాఁ జూచితే గాని శమముగాదు
కొమ్ము నీ హృద్గతంబైన కోర్కెలెల్ల - స్వస్థచిత్తుండవై యుండు స్వపురమందు.

వ. జగదీశ్వరుండు తిరుగ బలుకునది యెట్టులనిన.

ద్వి. భవసుఖంబుల కాసపడుచు నీ ధరను - అల జపధ్యాన పూజాది కర్మముల॥
నొనరించుచును నగ్నినొక కాలనిలచి - ఘనవేషములఁ దాల్చి గాసందు జనుల॥
గన నాస గొనదయ్య కడుభూతమైన - తనకు వారికి మంచితనమదెన్నటికి॥

నిర్మలచిత్తులై సకలజ్ఞులైన - ధర్మతత్త్వములఁ దెప్ప లయుంచి॥
దేహేశ వీడి విదేహాంతైనట్టి - సోహంబనుచు మదిసొంపు మీరంగ॥
ప్రజలు తానీవంటి బ్రహ్మనిష్ఠులకు - దెలుగుబలుగ గడిదేరి యెదురొచు॥
వలసి యెల్లని వరము వరుసగా నొసఁగి - యిలను దైత్యులఁబట్టి యిపుడు నేఁ దునిమి॥
యెల్లకాలము భూమినేలగాఁ జేతుఁ గొల్లగా వరముఁ జేకొనుము ప్రహ్లాద॥

వ. ఈలాగున తన దయకుఁ బాత్రుఁడని యెంచక నిర్దయుని వలెనే పలికిన
శ్రీహరినిఁ జూచి ప్రహ్లాదుఁడు అత్యంత దీనుఁడై యానంద బాష్పధారాసిక్త
కపోలుండై పలుకునది యెట్టులనిన.

క. దీనార్తి భంజనుండని
యానాడే కీర్తినీకు హెచ్చెను కనవే
నీ నోము సేయువాఁడని
శ్రీనాయక నాదుపైనఁ జింతయు లేదే.

వ. ప్రహ్లాదస్వామి తిరుగఁ బలుకున దెట్టులనిన.

క. కర్దని నమ్మిన భక్తులఁ
బర్దునఁగని నీదుమనసు పాకంబగునే
సర్దయుఁడ వైతివైనను
చర్దన్నపు మీదివెన్న చందమునగునే.

క. వంచన సేయకు నాయెడఁ
గొంచెతనంబదియు నీకు కోదండధరా
మంచిది నీ నడతలు వ
ర్ణరించెద నిను నిర్మలాత్మ నీరజనయనా.

వ. ఈలాగున శ్రీహరి గుణానుభవంబులను ప్రహ్లాదుండు వ్ణరించునది యెట్టులనిన.

కీర్తన నాగగాంధారి - చాపు

పల్లవి ఓరామ రామ సర్వోన్నత నీకిపు - డోరవంచన యేలరా ఘృణాకర

చరణ (1): వేదశిరములెల్ల నాదరణతో నీ - వే దైవమని నమ్మితి మేనమ్మితి

చరణ (2): పెద్దలైన వారి యెద్దనే సత్యము కర్దని నమ్మితిని సమ్మతిని

చరణ (3): బంధురత్నమా దయా - సింధువీవని సత్యరత్నమ వనుకొంటిని రమ్మంటిని

చరణ (4): భరతుచర్య సహచరునితో నిండారఁ - గరఁగుచుఁ బలికితివే కాచితివే

చరణ (5): సతిమాటలుసదా కపిజాచే విని స -మ్మతిని గౌగిలించిన శుభానన

చరణ (6): వరభక్తకోటులు కొనియాడ నీవు - వారల బ్రోచినది లేదా మరియాద

చరణ (7): ఈ జగతిని ప్రహ్లాదుని బ్రోచుట - కీ జాలమిక తాళ నీవేళను

వ. ఇవ్విధంబునఁ గనులు కలంగగ నంతరంగము కరంగగఁ బలికిన ప్రహ్లాదునిఁ
జూచి కపటపు చిరునవ్వెలయ శ్రీహరి పలుకున దెట్టులనిన.

చ. కపటపునవ్వుగాగఁ జిఅకాలము లింద్రియ నిగ్రహంబుచేఁ
దపమొనరించువారలకుఁ దప్పవు భోగము లింద్రసౌఖ్యముల్
అపరిమితాపదల్ మదిని నార్చుచు ధైర్యముసేయు నీదుపై
కృపగల వాఁడనైతి బహు కీర్తిగ సంపదలీక తీరునే.

వ. తిరుగ శ్రీహరి కపట వాక్యములు పలుకున దెట్లనిన.

క. నీకొక మర్మము దెలిపెద
లోకుల కరుదైన నిధుల లోకువసేతున్
చేకొనుము చనెద దూరము

నాకోర్కెలు నాదుపనులు నానావిధముల్.

వ. ఈలాగున నెడబాయఁదలచి పలికిన శ్రీహరి వాక్యములను వినఁగనే
ప్రహ్లాదుండతి వ్యసనాక్రాంతుఁడై పలుకున దెట్టులనిన.

క. చనవతెనను వార్తనువిని
కనులను బాష్పములురాలఁ గడు దుఃఖముతో
వనరుహానయనునిఁ జూచుచు
దనుజార్భకుఁ డడలుకొన్న తరి యెట్లన్నన్.

ద్వి. ఏ యాలి సుతులకై యెవరైకాలకు – నాయాసమగు తపంబమరఁజేసితిని॥
ఏ శత్రువర్గాలకే రాజ్యములుగోరి – యాసించి నే తపంబమరఁజేసితిని॥
ఏ దేవతలగోరి యేజలంబులలోన – ప్రాదేశకుక్షియై ప్రార్థించుకొంటి॥
ఏ యాపదలను నేనెఱిగి తాళితిని – మాయావిలాస నామది నెఱుగలేవ॥
నిను సుఖదుఃఖముల్ విశ్వమంతయును – నిను వినాయెవ్వరే నిఖిలభావజ్ఞ॥
న్యాయమా నీకు నన్యాపదేశముగఁ – బాయనెంచుచు మాటఁ బల్కితివిపుడు॥
తాళదు యీ మాట తాళదే మనసు – వేళగాదిది వేదవేద్య మ్రొక్కెదను॥

క. ఎడబాయఁ దలచినావిక
విడువను నాతండ్రి నిన్ను వేమరుమదిలో
జడియక నీపదయుగముల
దడసేయక కట్టివేతు దాళను నేనున్.

కీర్తన మధ్యమావతి – ఆది

పల్లవి శ్రీరామ జయరామ – శృంగారరామ
చరణ (1): గారవమున బ్రోవు – కరుణాసముద్ర
చరణ (2): నాలోని జాలి నీ – కేల తోచదురా
చరణ (3): మనసిచ్చినాతోను – మాటాడేదెపుడు
చరణ (4): తాల నీవేళ నిక – తాళమారామ
చరణ (5): బలిమిని వలచితే – చలమా ఓరామ
చరణ (6): ఈసౌఖ్య మీభాగ్య – మెందైనఁ గలదా
చరణ (7): జపమేమొ తపమేమొ – యపరాధమేమో
చరణ (8): పంకజనయనా నా – కుంకుమ నీవే
చరణ (9): అవనిజాధిప నాసాగ – సెవరిదె రామ
చరణ (10): నీవు నిమిషములేని – భావుకమేలే
చరణ (11): తోషింపకెన్నాళ్లు – తోచునేరామ
చరణ (12): ఎల్లసౌఖ్యములు – మనసొల్లదేరామ
చరణ (13): హాయగా మేను సగమాయె నోరామ
చరణ (14): ఈయంద మీచంద మెందైన గలదా
చరణ (15): కూర్చు వెతలార్చు కడ – తేర్చవే రామ
చరణ (16): మిక్కిలి మ్రొక్కి చేఁజిక్కితి రామ
చరణ (17): రాజిల్లు శ్రీత్యాగరాజాది వినుత

వ. అంతట ప్రహ్లాదస్వామి తనలోఁ దానే స్వరూపమెఱింగి యపరోక్ష
సాక్షాత్కారమైనందున నజ్ఞాన జనితమైన జాలినీక జెందనేల
అని ధైర్యానందజలధిలో నీదుచు బలుకున దెట్టులనిన.

క. ఇంతటి భాగ్యముఁ గల్గగ
చింతల చేఁజిక్కనేల శ్రీహరియనుచున్
అంతఃకరణంబున జగ
మంతయు హరిమయమటంచు నమరగఁ బలికెన్.

సీ. వెన్నయుండగ నేతి వెసనంబుపడనేల - అన్నముండగఁ జొన్నయంబలేల
తల్లి గల్గు సుతకు దాది వెసనమేలఁ - దన్నుఁ దాఁ దెలిసిన తత్త్వమేల
వ్యాధిహీనునకును వైద్యుని చెలిమేల - స్వధనంబులుండఁ బంచాంగమేల
నన్ని నీవనువాని కమరభేదంబేల - ధీరునకొక వైరి దిగులదేల
నాదు భావంబు నీవెంచి నన్నుఁ బ్రోవు - మన్యమైన సహింపలే నప్రమేయ
నీవు నా యొద్ద నుండుటే నిండు సుఖము క్ష్మాసుతాధీశ నీ కటాక్షంబె చాలు.

కీర్తన బిలహరి - చాపు

పల్లవి సరసీరుహనయన నీ కటాక్షమే చాలు సజ్జన జీవన
చరణ (1): మీన మర్భకులు కామించి కన్నట్లు - దానవీలంకను దయజూచినట్లు
చరణ (2): సాధుసంగతి నేను సలిపినయట్ల - మాధుర్య భోజనము చేసినట్ల
చరణ (3): ధనకనకములెల్ల దగిలినయట్ల - దినము దురాశలు దీరినయట్ల
చరణ (4): సింహాసనంబునఁ జెలగిన యట్ల - బ్రహ్మేంద్రపట్టానుభవ మందినట్ల
చరణ (5): నాల్గొక్కపది భువనము లేలినట్ల - కల్గుకులములెల్లఁ గడతేరినట్ల
చరణ (6): రాజీవభవనుత రమణీయచరిత - రాజిల్లు శ్రీత్యాగరాజాదివినుత

వ. ఇవ్విధంబున నతి ధైర్యభక్తి గల పలుకులు పలికిన ప్రహ్లాదునిఁ జూచి అత్యంత దయతో
నతని నిజభక్తిమార్గము లోకులకెల్లఁ దెలియుటకై శ్రీహరి పలుకున దెట్టులనిన.

క. నీ వద్దను నేనుండగ
నీవలనను చేయుటేమి నిర్మలచిత్తా
భారము నాతోఁ దెల్పుము
కావలసిన కోర్కెలొసఁగి కాపాడెదఁగా

వ. ఇటువలె సాదరుండై పలికిన శ్రీమన్నారాయణమూర్తినిఁ జూచి అత్యంత సంతోషంబున
నానందాశ్రు పరిపూరిత లోచనుండై గద్గద కంఠుండగుచు ప్రహ్లాదమూర్తి పలుకు టెట్టులనిన.

క. ఎన్నిన నా కోర్కెలు విను
పన్నుగ నే సొమ్ముపెట్టి పరిమళములచే
మిన్నైన మేన నలదుచు
కన్నుల నేఁ జూచి చూచి కాలము గడుతున్.

కీర్తన వరాళి - చాపు

పల్లవి వద్దనుండేదే బహుమేలు వారిజాక్ష
అనుపల్లవి అద్దంపు మోముగల రంగ - అనుపమ మోహనాంగ
చరణ (1): బంగారు పూలఁ బూజింతు - బాగుగ నిన్ను సేవింతు
శృంగారించి కౌగలింతు - చిరకాల మారాధింతు
చరణ (2): ముంగల నే నటియింతు - ముద్దుమాటలఁ దేలింతు
సంగీతము వినిపింతు - సారెకునే సంతోషింతు
చరణ (3): సత్తమాత్రమా నీయందు - చిత్తముగాని పొందెందు
తత్తరముఁ దీర్చుకొందు - త్యాగరాజ సులభుడందు

వ. ఇవ్విధంబునఁ బలికిన పలుకులు విని శ్రీహరి ప్రహ్లాదుని నిజభక్తిగల
హృదయ మర్మంబు దెలియ బలుకున దెట్టులనిన.

క. అంకమొసంగితి నాసుర
శంకల వధియింతునంటి సంపదలొసగే
నింకన్ నా దయయెట్లో
సంకేతము దెల్పు రాత్రిచరవర తనయా.

వ. ఈలాగున బలికిన శ్రీహరిని గనుంగొని ప్రహ్లాదస్వామి తన హృదయ గతమగు
సంకేత మెఱింగించు మార్గ మెట్టులనిన.

క. తీర దలంకారించక తీరదు
నుతియింపలేక దివ్యాన్నంబుల్
తీరదు తినిపింపక నే
తీరదు నీకింక ప్రొద్దు దీనాధారా.

కీర్తన సావేరి - ఝంపె

పల్లవి తీరునా నాలోని దుగ్ధ

అనుపల్లవి సారమౌ నీపాద సారసము
నాదు హృదయార విందము బెట్టి కట్టుకోక

చరణ (1): కమ్మవిల్తునిఁ గన్న - కాంతి గలిగిన హారే
ముమ్మారు పాలన్నము - భుజియింపఁ బెట్టి
కమ్మని విడెంబొసఁగి - కడు రత్నములు మెఱయు
తమ్మ పుటికనుఁ బట్టి - తానిపుడు నిలువకను

చరణ (2): అనుదినము నీదు పాదాబ్జముల నొత్తుచును
కనకమయమౌ సురటి కరమునిడి విసరి
ఘనమైన ఫణితల్పమున నుంచి పాడుచును
కనులార సేవించి కాలములఁ గడపకను

చరణ (3): రాజాధిరాజ సురరాజ వందిత పాద
శ్రీ జానకీరమణ శృంగార జలధే
రాజ వరుఁడగు త్యాగరాజ పూజితుఁడనుచు
రాజిల్లు నీకీర్తి రాజిగాఁ బొగడకను

వ. ఇవ్విధంబున ప్రహ్లాదుండు తన నిజహృదయ మర్మంబు దెలిపి
మఱియు శ్రీహరినిఁ జూచి పల్కునది యెట్టులనిన.

ఉ. పున్నమనాటి చందురునిఁబోలు ముఖంబునుఁ జూచి చూచి యో
పన్నగశాయి యో దనుజభంజన నన్ను యెడబాయకంచు దాఁ
బన్నుగ వేడుకొంచు నిజ భక్తిని నిమ్మని జాలిజెందుచున్
కన్నుల నీరుతో నసుర కాంతజుఁడా హరి సేవసేయగాన్.

వ. ఇటువలెఁ బలికి యూరకున్న ప్రహ్లాదుని జూచి శ్రీహరి పలుకున దెట్టులనిన.

క. ముందటి భక్తుఁడు నీవని
ముందరనే ఖ్యాతిగాను మోదముతోడన్
అందరు బల్కఁగఁ జేసితి
నిందున నీకన్న భక్తుఁడెవ్వరుఁ గలరే.

వ. ఇవ్విధంబునఁ బలికిన శ్రీమన్నారాయణునిఁ జూచి సమయమనుచుఁ

దెలిసి పలుకున దెట్టులనిన.

క. స్వర్ణమయాంబర శ్రీకర
వర్ణాభయహస్త మత్తవారణశరణా
కర్ణింపుము నామనవి సు
పర్ణునివలె భక్తినిమ్ము పదిమారులకున్.

వ. ఇటువలె వైనతేయునివలెఁ బరిచార భక్తినిమ్మనిన ప్రహ్లాదునిఁ జూచి
శ్రీమన్నారాయణుండు పలుకున దెట్టులనిన.

క. అజశక్రాదు లెఱుంగని
నిజ భజన పథంబు దెలిసి నిశ్చయమనుచున్
గజవరదుఁడు యోచించి స
హజమున ప్రహ్లాదుఁజూచి యమరగఁ బలికెన్.

సీ. సరిసమానము నిను సల్పంగఁ బూనిన - బరిచారకముసేయు బ్రతుకదేల
నేర్పైన దృఢభక్తి నేనెఱుంగలేక - యెన్నగా నీ నిజం బెందు లేదు
నలువక్త్రందుకైన నాదివ్యరూపంబుఁ - గన దూరమైయుండుగాని ధరను
నీ స్నేహరజ్జుచే నిండారఁ దగిలి నే - నీకు వశ్యుఁడనైతి నిర్మలాత్మ
సత్వగుణభక్తికిపుడు నే సాక్షిగాద - నీకుఁ బలుమారు నడుగంగ నీతిగాదు
యన్యమైనట్టి యధికార మడుగవయ్య - ఖ్యాతిమీరంగ నొసగెదఁ బ్రీతితోడ

సనకాదయః ॥రాజన్‌పతి గురురయం॥
(సనకాదులు "రాజన్‌పతి గురురయం" అను కీర్తనము పాడుదురు)

వ. ఈలాగున పలికిన శ్రీమన్నారాయణునిఁ జూచి ప్రహ్లాదుండు పలుకున దెట్టులనిన.

క. ధర్మార్థ కామమోక్షము
ధర్మాంబర తనకుఁ గలుగు భక్తియువలెనే
శర్మంబులెల్ల దొరుకును
నిర్మలమగు భక్తినిమ్ము నిన్నే కొలుతున్.

శ్లో. నాస్థాధర్మే న వసునిచయే నైవ కామోపభోగే
యద్యద్భవ్యం భవతు భగవన్ పూర్వకర్మానురూపం
ఏతత్ప్రార్థ్యం మమ బహుమతం జన్మజన్మాంతరేపి
త్వత్పాదాంభోరుహ యుగగతా నిశ్చలాభక్తిరస్తు॥

వ. తిరుగ ప్రహ్లాదస్వామి పలుకున దెట్టులనిన.

క. తెగనాడు మాటలెందుకు
నగధర సరివారిలోన నగుబాటుగదా
పగలెల్లఁ జూపి నాయెడఁ
బగసేయుట కేమిఫలము భక్తాధీనా.

క. నాలోని జాలిఁదెలిసియు
నీలాగు బరీక్ష సేయనేలా మేలా
చాలా ధర్మము గాదికఁ
బాలించుర వేగ నన్ను భావజజనకా.

వ. ఈలాగున ప్రహ్లాదుండు అత్యంతజాలిచే శ్రీహరినిఁ జూచి మఱియు బలుకున దెట్టులనిన.

కీర్తన సావేరి - ఆది

పల్లవి రామాభిరామ రఘురామ ఓరామ

అనుపల్లవి తామసంబేల సీతా మనోరమణ

చరణ (1): పగసేయుటెల్ల నాపాలా నీదు - వగలేల విడఁజాలవు గజేంద్రపాలా

చరణ (2): నీసొమ్ము నేనడుగలేదు నిండు - మోసమౌ ప్రపంచ మందాసలేదు

చరణ (3): ఆసనీయెడఁ దనకుఁ బోదు నిజ - దాసరక్షక నినువినా గతియులేదు

చరణ (4): నీ సరిసమాన మెవరిలలో రామ - నీరజదళాక్ష చిక్కితిరా నీవలలో

చరణ (5): శ్రీపతే నను మరువఁదగునా యిది - పాపమేగాని యెడబాయ మనసగునా

చరణ (6): ఆజానుబాహం కరవీరా శ్రీత్యాగరాజుని భవాబ్ధి దాటించి వరవీరా

వ. ఇవ్విధంబునఁ బలికిన ప్రహ్లాదునియొక్క యాంతర భక్తిమార్గమునుఁ దెలియుటకై
శ్రీహరి పలుకునది యెట్టులనిన.

క. గౌరవమని లాఘవమని
సారెకు భావించునడత సమ్మతి గాగన్
వారము సమమై నడిచెను
వారిని నే నెఱుగజాల వసుధాస్థలిలోన్

క. ఆ భారతీ శుకైన స
దా భేదపు బుద్ధియెల్ల దత్యనుభావం
బే భక్తి చిత్తయుతమౌ
నా భక్తికి కట్టుపడుదు నతఁడే నేనున్.

వ. ఇవ్విధంబునఁ బలికిన శ్రీహరినిఁ జూచి ప్రహ్లాదుండు తన యంతరానుభవంబుఁ
దెలియఁజేయున దెట్టులనిన.

క. అందరిలోపల నీపై
నందార్చిత నాదుమనసు నళినదళాక్షా
ముందు నెఱుంగగ లేదా
సుందర లోకోపకార సుద్గుణ గాకన్.

కీర్తన మోహన - ఆది

పల్లవి దయరానీ దయరానీ - దాశరథే రామ

చరణ (1): వివరింప దరమా రఘు - వీరానందమున రామ

చరణ (2): తలచితే మేనెల్లఁ - బులకరించీని రామ

చరణ (3): కనుగొన నానందమై - కన్నీరు నిండీని రామ

చరణ (4): చరణ కౌగిలివేళ - జెలగి వైమఱచీని రామ

చరణ (5): చెంతనుండగా నాదు - చింతలు తొలగీని రామ

చరణ (6): ఆసించువేళ జగమెల్ల - తృణమయ్యీని రామ

చరణ (7): శ్రీత్యాగరాజుని - చెలికాఁడు నీవే రామ

సనకాదయః ॥పథి పథికము॥
(సనకాదులు "పథి పథికము" అను కీర్తనము పాడుదురు)

వ. ఈలాగున స్వానుభవంబు తెలిపిన ప్రహ్లాదునిఁ జూచి యంతరాంతర
మర్మములు దెలియ వలయుటకై శ్రీహరి పలుకున దెట్టులనిన.

ద్వి. పంతంబు సాధింపఁ బల్కెదుగాని - యంతకు నే పాత్రుఁడని యెంచవలదు॥
వెన్నవంటి మనసు విశ్వాత్మకుండు - అన్న నీవెఱుఁగవా యసురేశతనయ॥
అబ్బబ్బ నీయొక్క యంతరంగమును - గొబ్బునఁ దెలియంగఁ గూడలేదికను॥
బాలక నీలోని భావమిట్లనుచు - నీలోకులకు నీవె యెఱింగింపు మిపుడు॥

వ. ఈలాగున శ్రీమన్నారాయణుఁ డనగా విని యిక తీరదని ప్రహ్లాదుండు

తన మనోభావంబు నెఱిగింపఁజేయు మార్గం బెట్టులనిన.

ద్వి. పారెపారెకు నామనోరథంబులను - నీరజలోచన నిజముగా వినుము॥
పంకజములకెల్ల భానుచందమున - నింకనుఁ గలువల కిందు చందమున॥
మాన్యయౌ మగువకు మగని చందమున - దీనజనావన దేవదేవేశ॥
తనకు నీవటుగాద ధరణీసుతారమణ - మనసిజలావణ్య మంజులవదన॥
వలచుచు నేనొక్క వరమడిగెదయ్య - సలలిత గుణబృంద సాధుహృత్సదన॥
పరమపావన రామ పాపౌఘశమన - కరుణను దయచేసి కావవే కృష్ణ॥

కీర్తన యదుకులకాంభోజి - ఆది

పల్లవి దయసేయవయ్యా స - దయ రామచంద్ర

అనుపల్లవి దయను కొంచెమైన నాఁడు - తలచుచున్న సీతాసుఖము

చరణ (1): క్షితినాథుల రాకయు స - మ్మతిలేక శ్రీసాకేత
పతి రాడేయన వచ్చునంటె - సతికి గల్గినానందము

చరణ (2): చెలియరో నావలె నాథునకు - గలరేమో రాలేదని జాలిఁ
దెలిసి మ్రొక్కికోఁ బోవువేళ - బలిమిని నెదురైన సుఖము

చరణ (3): కొంచమీ రూపమా విల్లు - వంచకూడకపోనో యని
ఎంచి జాలిఁజెంద మేను - బెంచి కనిపించినట్ల

చరణ (4): ఎట్టివారికైన దొరక - నట్టి జనకజను బొట్టు
గట్టి కరముఁ బట్టువేళ - కాంతకున్న సుఖము తనకు

చరణ (5): కోరిన వారలను నే - నీరీతి బ్రోతునని సభ
వారలకు దెలియఁజేయు - దారి త్యాగరాజునకు

వ. ఈలాగున సీతాభక్తి నిమ్మనుచు ప్రహ్లాదుడు శ్రీహరినిఁ జూచి తనమదిలో నీశ్వరుండు
మానాభిమానంబులు లేని పరవస్తువని తెలిసి శపథంబు చేయునది ఎట్టులనిన.

క. వేడెద, మ్రొక్కెద, ననుఁదెగ
నాడక శపథంబు వినుము నారదగురుఁడా
నాఁ డుపదేశించినదే
పోడిమిగా సత్యమైనఁ బోరాడకుమా.

వ. ఈలాగునఁ బలుకుచు తిరుగ ప్రహ్లాదుండు

క. తల్లినిఁగను పుత్రునివలె
నుల్లం బానందమంది యోహోయనుచున్
ఝల్లను తనతో హరిపద
పల్లవముల వ్రాల హరియు బాహంనఁ బట్టెన్.

సనకాదయః ॥భవాబ్ధిమంతి॥
(సనకాదులు "భవాబ్ధిమంతి" అను కీర్తనము పాడుదురు)

వ. ఇవ్విధంబునఁ బాదాక్రాంతుఁడైన పరమభాగవతాగ్రేసరుండును, భక్తవారిధి చంద్రుండునుఁ,
బరవశుండుననగు ప్రహ్లాదునిఁ జూచి శ్రీమన్నారాయణమూర్తి యేమి చేయుచున్నాఁడనిన.

క. పంకజ నేత్రుఁడు భక్తవ
శంకరుఁ డాద్యంతరహిత శాంతాకారుం
డంకమున నుంచి ప్రేమనుఁ
గంకణములు ఘల్లనంగఁ గౌగిటఁజేర్చెన్.

సనకాదయః (సనకాదులు)

శ్లో. యది హాస్య ప్రియాఖ్యాతః నకుర్మి సదృశం ప్రియం
విష సర్వస్వ భూతస్తు పరిష్వంగో హనూమతః॥

వ. అంతట శ్రీహరి ప్రహ్లాదు నుపలక్షించి పలుకున దెట్టులనిన.

క. జ్ఞానము వైరాగ్యము వి
జ్ఞానము సద్భక్తి సమముగాగ భవుని నే
గానను ముల్లోకములన్
మాన్యుని నినుఁగంటి నీ సమానంబెవరే.

ద్వి. వినవోయి ప్రహ్లాద విమలాంతరంగ - వినఁగోరి నీ పల్కు వివరంబుగాగ॥
చలమున వాదంబు సల్పితి విపుడు - సలలితమతినైతి సంతోషినైతి॥
నీకోర్కు లెల్లను నిజముగఁ గల్గు - నేఁ గోరు పనులెల్ల నెరవేరె నిపుడు॥
సుఖమున వర్ధిల్లు సురవైరి తనయ - అఖిలాండములనేలు మాచంద్రసూర్య॥
స్థాయిగా విలసిల్లు సానందముగను - హాయిగానుండు నీవారోగ్యమునను॥

వ. ఇటువలె తన స్వాభీష్టముల నొసంగిన భక్తపరాధీనునిఁ, బరమ పురుషుని,
చరాచరరూపుని, శంఖచక్రాంకితాజాను చతుర్బాహుని, పుండరీకాయతాక్షుని,
పురాణపురుషుని, శరణాగతవత్సలుని, జగన్మోహనాకారుని, దివ్యతేజోమయుని,
దివ్యపీతాంబర వనమాలాధరుని, ఆదిమధ్యాంత రహితుని, అఖిల జగద్వ్యాప్యుని,
ఆత్మారాముఁడగు శ్రీమన్నారాయణమూర్తిని ప్రహ్లాదుండు షోడశోపచారములచేఁ
బూజించుచు బ్రహ్మానంద పరవశుఁడై పలుకునది యెట్టులనిన.

కీర్తన భైరవి - ఆది

పల్లవి ఆనందమానందమాయెను బ్రహ్మానంద - నిత్యానంద సదానంద పర

చరణ (1): శ్రీరామ నే ధన్యుఁడనైతిని ఆనంద - నీరధిలోన నీదనైతిని - రామ
సారెకు నీవాడని పేరును గాంచితి

చరణ (2): ఆనాటి మొదలు నిన్ను వేడితి - దుష్టమానవుల చెలిమివీడితి - నా
మానమె నీదు భారమనుచునుఁ దలచితి

చరణ (3): పాపములకు భయమందితి హృత్తాపములెల్ల చల్లచేసితి - రామ
నీ పాదమురమున - నుంచి ధ్యానించగ బ్ర

చరణ (4): కలికి యాసలు రోసినాడను ఈ - కలికి బ్రతుకు నామసారము- ఇట్లు
పలికి పల్కి తొలఁగి పాయ విచారము

చరణ (5): ఇలలో సుఖము లేమాయెను అంటె - కలఁగన్న భాగ్యపు చందమాయె - నిన్ను
కొలిచి ధ్యానించి తెలిసికొంటి నీ మాయను

చరణ (6): నీయందమునుఁ గని సొక్కితి నెడ - బాయని ప్రేమచేతఁ జిక్కితి నా
ప్రాయము లెల్ల నీ - పాలిజేసి మ్రొక్కితి

చరణ (7): నలువకైనను నింద్రుకైనను జంద్ర - కళను ధరించు వానికైనను రామ
తలఁచినదెల్లఁ జెప్పతరమా - నోటికి రాదు

చరణ (8): అన్యముగాఁ జూడఁ దోచెనా కనుక - ధయ్యొన్యహమని పల్క యోచనా మూ
ర్ధన్యులైన భక్తాను ధ్వాంత విరోచనా

చరణ (9): రాజసగుణమును మానితి రామ - నీజపమును మదిఁ బూనితి త్యాగ
రాజు చేసిన పుణ్య - రాశియని యెంచితి

వ. ఈలాగునఁ బరవశుండై పాడుచు మంగళముఁ బాడున దెట్టులనిన.

మంగళము

| | |
|---|---|
| కీర్తన | ఘంటా - ఝంపె |
| | పల్లవి జయమంగళం నిత్యశుభమంగళం |
| | చరణ (1): కరుణారసాక్షాయ కామారి వినుతాయ - తరుణారుణాభ సుందరపదాయ |
| | నిరుపమ శరీరాయ నిఖిలాగమచరాయ - సురవినుత చరితాయ సుందరాయ |
| | చరణ (2): కుందసుమ రదనాయ కుంభజ సుగేయాయ - మందరాగ ధరాయ మాధవాయ |
| | కందర్ప జనకాయ కామిత సుఫలదాయ - బృందారకారాతి భీకరాయ |
| | చరణ (3): సర్వలోకహితాయ సాకేత సదనాయ - నిర్వికారాయ మానిత గుణాయ |
| | సార్వభౌమాయ పోషిత త్యాగరాజాయ - నిర్వాణఫలదాయ నిర్మలాయ |

చతుర్థాంకము సమాప్తము.

వ. ఈలాగున ప్రహ్లాదస్వామి శ్రీవారిని సేవించుచు ప్రపంచ మంతయు
తృణముగా నెంచి నేత్రోత్సవానంద మందుచుండగ శ్రీమన్నారాయణమూర్తి
అతని మనసు శోధింప బలుకు మార్గం బెట్టులనిన.

సీ. పాలసాగరమందు బవ్వళించుటకన్న - భక్తుని హృదయంబు బాగుగాదె
అలవికుంఠమునందు నాదిలక్ష్మియుకన్న - భక్తుని హృదయంబు బాగుగాదె
చంద్ర సూర్యులయందు సతతముండుటకన్న - భక్తుని హృదయంబు బాగుగాదె
రాజయోగుల యంతరంగ రమ్యతకన్న - భక్తుని హృదయంబు బాగుగాదె
అట్టి నీ చిత్తవేదిలో ననిశముందు - నన్న మాకాంతపై నాన నిల్పినాను
వచ్చి ప్రార్థాయె నే మఱి వత్తుఁగాని - జాలిఁ బడఁబోకు ననుఁగానఁ జాలలేక.

వ. ఇవ్విధంబున శ్రీమన్నారాయణమూర్తి తన్నునెడ బాయుటకై పలికిన పలుకులు విని
యాశ్చర్య భయ శోకంబులచే ప్రహ్లాదుండు పలుకున దెట్టులనిన.

క. ఆనందాంబుధి నీదఁగ
దానవ మదగర్వహరుడ దాటున బలికెన్
వీనులఁ జొరుక్కనంగా
దీనత తన మదికి దోచి దిగ్గున లేచెన్.

క. ఏమిటి మాటను వింటిని
యేమో నేఁజేయు కర్మమెట్లో యనుచున్
రాముని ముఖమునుఁ జూచుచు
నేమంబున నసుర సుతుఁడు నేర్పునఁ బలికెన్.

వ. తిరుగ ప్రహ్లాదస్వామి పలుకున దెట్టులనిన.

క. నినుఁబాసి నిముసమోర్వను
తనువునుఁ దలిదండ్రులన్నదమ్ముల నొల్లన్
కనుగొను కలిమియె చాలును
వినతాసుతగమన వినుము విశ్వాధారా.

కీర్తన రీతిగౌళ - చాపు

పల్లవి నన్ను విడిచి కదలకురా - రామయ్య

అనుపల్లవి నిన్నుబాసి యర నిమిషమోర్వనురా

చరణ (1): అబ్ధిలో మునిగి శ్వాసమునుఁ బట్టి - యాణిముత్యము గన్నట్లాయె శ్రీరమణ

చరణ (2): తరముగాని యెండవేళఁ గల్ప - తరునీడ దొరికి నట్లాయె నీవేళ

చరణ (3): వసుధను ఖననముఁ జేసి ధన - భాండ మబ్బినరీతిఁ గనుగొంటి డాసి

చరణ (4): బాగుగ నన్నేలుకోరా యల్ల - త్యాగరాజనుత తనువు నీదేరా

సనకాదయః (సనకాదులు)

శ్లో. నచ సీతా త్వయాహీనా నచాహ మపి రాఘవ
ముహూర్తమపి జీవావో జలాన్మత్స్యావివో ద్ధృతౌ॥

శ్లో. నహి తాతం న శత్రుఘ్నం న సుమిత్రాం పరంతప
ద్రష్టు మిచ్ఛేయ మద్యాహం స్వర్గం వాపి త్వయావినా॥

వ. ఈలాగున స్వామిని నరనిమిషమైన నెడబాయఁ దరముగాదనిన ప్రహ్లాదస్వామినిఁ
గనుంగొని శ్రీహరి తత్త్వబోధనఁ జేయున దెట్టులనిన.

చ. తలచిన మర్మముల్ వినుము త్వాదృశ భక్త జనాంతరమ్మునన్
మెలఁగుచు సుందరాకృతిని మేల్మిగఁ బల్కుచుఁ గోర్కె లిచ్చుచుం
జెలఁగు చరాచరంబులనుఁ జేరితి లీలను నీ జగాన నీ
వలె దొరకంగ లేదు కని వచ్చెద వారిధి రాజ కన్యకన్.

వ. శ్రీహరి తిరుగఁ బలుకుచు వేంచేయున దెట్టులనిన.

క. రెండొక దినములపై నం
దుండక నే వత్తుననుచు దురమునఁగని తా
నిండార శాంతపరచుచు
మెండగు రూపమునఁ జూడమెల్లన లేచెన్.

వ. ఈలాగున నుపాయముగ బల్కుచు నావలికి వేంచేయు శ్రీహరి హృదయం బెఱిగి
ప్రహ్లాదస్వామి యత్యంత వ్యసనాక్రాంతుఁడై పలుకున దెట్టులనిన.

క. వడిగాఁ జన గాలాడక
యడుగడుగుకుఁ దిరిగిచూచు చావలికేగే
యుడుపతి వదనునిఁ బ్రహ్లా
దుఁడు తత్తరమంది చూచి దురమునఁ బలికెన్.

కీర్తన పంతువరాళి - త్రిపుట

పల్లవి అందుండక నేవేగ వచ్చేనని నాపై - నానబెట్టిపోరా

అనుపల్లవి మందరధర నీవాప్తులతోగూడి - మఱచితే విమిసేతునే ఓ రాఘవ

చరణ (1): కనవలె ననువేళ లేకుంటేఁ - గన్నీరు కాలువగాఁ బారునే
ఇనకులాధిప నీవు రాను - తామసమైతే నిల్లువాకిలయ్యేనే ఓ రాఘవ

చరణ (2): నిరుపమానందశయ్యపై లేకుంటే - నిముషము యుగమౌనే
పరమాత్మ నినుగానక భ్రమసినవేళఁ - బరులునవ్వుటకౌనే ఓ రాఘవ

చరణ (3): పరమభక్తియు నాప్రాయముల్లెల్లఁ - దనుజాల పాలుగాఁ బోనౌనే
వరద శ్రీత్యాగరాజార్చిత పదయుగ - వారిధిముందరనే ఓ రాఘవ

వ. ఈలాగున ప్రహ్లాదుండు ఆనఁబెట్టిపొమ్మన్న వార్తను విని భక్తపరాధీనుండు కనుక
నత్యంత హితవచనములుగా శ్రీహరి పలుకున దెట్టులనిన.

క. ఆలాగుగానె వచ్చెద
బాలక చింతించవద్దు భావము నీపై
లీలకుఁ దనువందిందని
చాలగ నల్లాడు ననుచు సరగున వెడలెన్.

వ. ఈలాగున బలుకుచు వేంచేసిన శ్రీహరినిఁ దలచి అత్యంత దుఃఖసాగరమున నీదుచుఁ
గన్నీరు లొల్కగ మైమఱచి ప్రహ్లాదుండు పలుకున దెట్టులనిన.

క. జరిగిన నాథునిగని యే
మరి దిక్కులఁజూచి చూచి మాధవ యనుచున్
బరితాపమొంది మనసునఁ
గరుణాకరు దలఁచి దలఁచి కరఁగుచుఁ బలికెన్.

సీ. తల్లిచెంతనులేని తనయుని చందంబు - హరినిఁ గానకయుండ నబ్బె తనకు
బతిని గానని సాధ్విపరితాప రీతిని - హరినిఁ గానకయుండ నబ్బె తనకు
భానుఁగానని చక్రవాకంబు చందంబు - హరినిఁ గానకయుండ నబ్బె తనకు
నిండుఁదాహపు గోవు నీరుగానని రీతి - హరినిఁ గానకయుండ నబ్బె తనకు
నంచు తన ఫాలమున వ్రాసె నబ్జభవుఁడు - ఎట్లుకాలంబు వేగింతు నేమిసేతు
హరినిఁ జేరుట ధరలోన నాటలౌనె - శీఘ్రమేలాగు చూతునో శ్రీశునిపుడు

కీర్తన హుసేని - ఆది

పల్లవి ఏమని వేగింతునే శ్రీరామ రామ

అనుపల్లవి ఏమని వేగింతు నెంతని సైరింతు
నాముద్దు దేవుడు ననుబాసె నయ్యయ్యో

చరణ (1): పాలించి లాలించి పలుమారుఁ గౌగలించి
తేలించి నను పరదేశిసేయ తోఁచెనే

చరణ (2): ఆడిన ముచ్చట నా దంతరంగము నిండ
నీడు లేదని యుంటి నిందాక సరివారిలో

చరణ (3): ఎడబాయక త్యాగరాజు నేలు శ్రీహరి తొల్లి
బడలిక లార్చి నాచెయి పట్టినది తలచుచు

సీ. ధనవంతుడైన వెన్క దారిద్ర్య పరుఁడైన - నంతకన్నను దుఃఖమెందు లేదు
పరమ సాధ్వికి పతి పరసతీ ప్రియుఁడైన - నంతకన్నను దుఃఖమెందు లేదు
జ్ఞానవిత్తునకు నజ్ఞానశిష్యుఁడు గల్గు - టంతకన్నను దుఃఖమెందు లేదు
హరిని జూచిన కన్నులన్య రూపముఁ జూచు - టంతకన్నను దుఃఖమెందు లేదు
ఇంతకధికంబు హరిలేని యాదినంబు - నెట్లు సైరింతు హరి హరి మేమిసేతు
నన్ను నెడబాసి యుండుట న్యాయమౌనె - యాది విభుతోను వివరింప నచటలేఁడె.

వ. ఈలాగున ప్రహ్లాదస్వామి అత్యంత వ్యసనాక్రాంతుఁడై మఱియుఁ బలుకున దెట్లనిన.

కీర్తన గౌళిపంతు - చాపు

పల్లవి ఎంత పాపినైతి నేమిసేయుదు హా - ఏలాగు దాళుదు నే ఓరామ

అనుపల్లవి అంత దుఃఖములనుఁ దీర్చుహరినిఁ జూచి - యెంత వారైననుఁ బాయ సహింతురే

చరణ (1): మచ్చికతోఁ దాను ముచ్చటలాడి మోస - పుచ్చియేచ మదివచ్చెనే కటకటా

చరణ (2): సేవజేయుటె జీవనమని యుంటి - దైవమా నాపాలి భాగ్యమిట్లాయెనా

చరణ (3): రాజిల్లు శ్రీత్యాగరాజు తాఁబొంగుచు - బూజించు శ్రీరఘురాజిందు లేనందు

వ. ఇవ్విధంబునఁ బాయరాని ఖేదంబునఁ బలు విధంబుల మొరలిడియు శ్రీహరినిఁ గానక
అఖండ సచ్చిదానంద స్వరూపుండైన శ్రీమన్నారాయణమూర్తి సతతంబు నివాసంబు
చేయుతావును యోచించునది యెట్లనిన.

శ్లో. నాహం వసామి వైకుంఠే నయోగి హృదయే రవౌ
మద్భక్తా యత్ర గాయంతి తత్ర తిష్ఠామి నారద॥

సీ. కరముల నర్చించి కనులార సేవించు - వరధీరులందు శ్రీవరదుఁ డుండు
నెఱిని శృంగారించి నేతిపాల్ త్రావించు - నిర్మలాత్ముల యందు నిలిచియుండు
కమ్మని విడెమిచ్చి కౌగలించనుఁ గోరు - భక్తాంకములయందుఁ బండియుండు
సగుణ రూపంబెత్తి సార్థకం బిదియంచుఁ - దెలియు పెద్దలయొద్ద దేవుఁడుండు
ననుచు ప్రహ్లాదుఁడీ మర్మమెల్ల దెలిసి - కనుల బాష్పంబు వ్రాలంగఁ గరఁగి గరఁగి
తన్ను నెడ బాసినది చూచి తాళలేక - హరిని వెదకుచు వెడలె నిండార్తి తోడ.

వ. అంతట ప్రహ్లాదుండు పరమ భాగవతోత్తములయందు శ్రీహరి నిత్య నివాసంబై సత్యంబుగా నుండునని తత్తరంబున శ్రీహరి గుణములను గట్టిగా మొరలిడు మార్గంబెట్టులనిన.

కీర్తన **కేదారగౌళ - ఆది**

పల్లవి ఓ జగన్నాథా యని నేఁ బిలచితే - నోయని రారాదా

అనుపల్లవి రాజీవనయన రాకేందువదన - రాజిల్లు సీతారమణీహృత్సదన

చరణ (1): ఇదివేళగాదు ఇకతాళఁబోదు - మదిని నీవేగాని మరి గతిలేదు

చరణ (2): ఇరవొందరాక యింత పరాకా - దొర నీవేయని తోచెను గాక

చరణ (3): లాలించు రాజా రవికోటి తేజా - లీలావతార పాలిత త్యాగరాజ

వ. ఈలాగున ననేక విధంబుల మొరలిడఁగా శ్రీహరి కనపడలేదని యా భక్తజనులఁ జూచి ప్రహ్లాదుండు అత్యంత దీనుఁడై వివరముగా నడిగే దెట్టులనిన.

క. అసమాను హరినిఁ గానక
వ్యసనార్ణవమందు మునిఁగి వ్యథజెందుచుఁ దా
దెసలేక బాష్పమొల్కఁగ
నసురార్భకుఁ డల్లవారి నడుగను వెడన్.

కీర్తన **యదుకులకాంభోజి - ఆది**

పల్లవి చెలిమిని జలజాక్షుఁగంటే - చెప్పరయ్యా మీరు

అనుపల్లవి పలుమారు మ్రొక్కెదను దయతోఁ - బలుకరయ్యా యెంతో

చరణ (1): శరచాపముఁ గరమున నిడి - మెఱయునయ్యా యెంతో
కరుణారసము నిండిన - కన్నులయ్యా

చరణ (2): చూడఁ జూడ మనసుకరఁగె - సుముఖుఁడయ్యా భక్తుల
జాడఁ దెలిసి మాటలాడే - జాణఁడయ్యా

చరణ (3): శృంగారిని బాసి మేను - చిక్కెనయ్యా హరి
చెంగట మున్నే నామది - చిక్కెనయ్యా హరి

చరణ (4): నాలోని జాలిఁ బల్కఁ - జాలనయ్యా హరి
మీలో మీరే తెలిసి - మర్మ మీయరయ్యా హరి

చరణ (5): త్యాగరాజ సఖుఁడని - తలఁతునయ్యా మీరు
బాగుగ నాయంగలార్పుఁ బాపరయ్యా

వ. ఈలాగునఁ బలువిధంబులఁ దలఁచి మొఱలిడి కరఁగుచున్న ప్రహ్లాదుని ప్రేమ దుఃఖంబు సైరింపలేక దేవసార్వభౌముఁడౌ శ్రీమన్నారాయణమూర్తి లక్ష్మీసమేతుండై సాత్త్విక భక్తాగ్రేసరుని కడకు వేంచేయున దెట్టులనిన.

ద్వి. చిత్స్వరూపుఁడు భక్తచిత్తానుసారి - యుత్సవ పురుషుండు ఉరగేంద్రశాయి॥
అన్నిటి తలిదండ్రియౌ నెరదాత - మన్నించి దయసేయు మావల్లభుండు॥
అజరుద్రకోట్లకు నాదిదేవుండు - నిజదాసు వెసనంబు నిర్వహింపఁగను॥
తనయునిఁ గనవచ్చు తల్లిచందమున - వనజాక్షి లక్ష్మితో వరదుఁడాక్షణము॥
మెరుపుకోట్లను గేరు మోమునఁ దాల్చి - కరుణతోఁ బ్రహ్లాదు కడకు వేంచేసె॥

క. మెఱపును కనకశలాకను
మరుకాంతిని ధిక్కరించు మైతో దయతో
సరగున వేంచేసిన మధు
మురవైరియు దూరదూరమునఁ గనుపించెన్.

వ. అంతట నతిదూరమునఁ గనఁబడిన సత్వమాత్రుని నిత్యశుద్ధబుద్ధుని నిర్వికారుని ఆదిమధ్యాంత రహితుని సచ్చిదానందుఁడగు సీతాసమేతుఁడైన శ్రీరామచంద్ర స్వరూపుని శ్రీమన్నారాయణ దేవుని దురమున ప్రహ్లాదుండు నిశ్చయము చేయున దెట్టులనిన.

కీర్తన కాపి - ఆది

పల్లవి పాహికల్యాణరామ పావనగుణరామ

చరణ (1): నా జీవాధారము - నా శుభాకారము

చరణ (2): నా నోము ఫలము - నా మేనుగునము

చరణ (3): నా వంశధనము - నా దైదోతనము

చరణ (4): నా చిత్తానందము - నా సుఖకందము

చరణ (5): నాదు సంతోషము - నా ముద్దువేషము

చరణ (6): నా మనోహరము - నాదు శృంగారము

చరణ (7): నా పాలిభాగ్యము - నాదు వైరాగ్యము

చరణ (8): నాదు జీవనము - నాదు యౌవనము

చరణ (9): ఆగమసారము - అసురదూరము

చరణ (10): ముల్లోకాధారము - ముత్యాలహారము

చరణ (11): దేవాదిదైవము - దుర్జనాభావము

చరణ (12): పరమైన బ్రహ్మము - పాపేభసింహము

చరణ (13): ఇది నిర్వికల్పము - ఈశ్వరజన్మము

చరణ (14): ఇది సర్వోన్నతము - ఇది మాయాతీతము

చరణ (15): సాగరగుప్తము - త్యాగరాజాప్తము

క. ఇతఁడే జీవాధారుం
డితఁడే నానోము ఫలము నింద్రాది నుతుం
డితఁడే మును నన్ను బ్రోచిన
డితఁడే సర్వేశ్వరుండు నితఁడే యితఁడే.

వ. ఈలాగున తన మది భ్రాంతి చెందనేల శ్రీమన్నారాయణుఁ డితఁడేయని నిశ్చయించి శ్రీస్వామిని సేవించి సాష్టాంగ మొనరించున దెట్టులనిన.

ఉ. తల్లినిఁ జూచు బిడ్డవలెఁ దామరవైరికిఁ గల్వచందమై
పల్లవపాణి జారువలె భానుడూ తేవఁగ విప్రురీతిఁ దా
నుల్లము నాసజెంది నిఖిలోత్తమ దేవునిఁ గన్నయంతనే
ఝల్లని బాష్పముల్ వదలసాగెను పాదములందు మ్రొక్కఁగన్.

వ. అంతట శ్రీహరి యత్యంత దయతో ప్రహ్లాదునిఁ గౌగలించున దెట్టులనిన.

ద్వి. హరియు భక్తునిఁ బట్టి యంకమందుంచి - కరము కరమునబట్టి కౌగిటఁ జేర్చి॥
సామజవరదుండు జగమెల్ల మెచ్చ - మోము మోమునఁ జేర్చి మోదంబువీఁ॥
బ్రాపు నీకైతిని ప్రహ్లాదయనుచుఁ - జూపు చూపొకటిగాఁ జూచి రిద్దరును॥
అతఁడితఁడనిలేక ఆకారయుగము - సతతము నొకటిగా సంతుష్టులైరి॥

వ. ఈలాగున ప్రహ్లాదుండు అత్యంతాత్మ హర్షంబుగలవాఁడై శ్రీహరినిఁ జూచి పిలుచున దెట్టులనిన.

కీర్తన అసావేరి - ఆది

పల్లవి రారా మా యింటిదాఁక రఘు
వీరా సుకుమారా మ్రొక్కేరా

అనుపల్లవి రారా దశరథకుమారా నన్నేలు
కోరా తాళలేరా రామ

చరణ (1): కోరిన కోర్కెలు కొనసాగకయే
నీరజనయన నీ దారినిఁగని వే
సారితిఁగాని సాధుజనావన
సారివెడలి సామినేఁడైన

చరణ (2): ప్రొద్దునలేచి పుణ్యముతోటి
బుద్ధులుచెప్పి బ్రోతువుగాని
ముద్దుగారు నీ మోమునుఁ జూచుచు
వద్దనిలిచి వారము పూజించెద

చరణ (3): దిక్కు నీవనుచుఁ దెలిసిన ననుఁ బ్రోవఁ
గ్రక్కునరావు కరుణను నీచేఁ
జిక్కియున్నదెల్ల మఱతురా యిఁక శ్రీ
త్యాగరాజుని భాగ్యమా

వ. అంతట ప్రహ్లాదస్వామి శ్రీహరినిఁ జేరి అత్యంత కుతూహలంబున నున్న వార్తవిని యిట్టి వేడుకనుఁ జూచుటకై సత్యలోకంబుననుండి బ్రహ్మదేవుం డేతెంచు మార్గం బెట్టులనిన.

క. హంసతురంగారూఢుఁడు
హంసార్చితుఁ డాదిదేవుఁ డానందముతోఁ
గంసారి దర్శనార్థము
సంసారముతోడ బ్రహ్మ సరగున వెడలెన్.

కీర్తన కల్యాణి - చాపు

పల్లవి కమలభవుఁడు వెడలెఁ గనుఁగొనరే

అనుపల్లవి విమలహృదయమున - విష్ణునిఁ దలఁచుచు

చరణ (1): దండముఁబట్టి కమండలువుఁ బూని
కొండాడుచును కోదండపాణిని జూడ

చరణ (2): సారెకు హరినామ సారముఁ గ్రోలుచు
ధీరుఁడు నీరధి తీరమునకు నేడు

చరణ (3): ఆజానుబాహుఁడు అమరేంద్ర వినుతుఁడు
రాజీవాక్షుని త్యాగరాజనుతునిఁ జూడ

వ. ఇటువంటి వైభవములను విని స్వర్గలోకము నుండి దేవేంద్రుండు వచ్చున దెట్టులనిన.

క. నిరవధి సుఖదాయకుఁడగు
పరమాత్మునిఁ జూడఁ జిత్త పరవశతను దా
మఱిమఱి శృంగారించుక
సురపతి వేంచేయు నట్టి సొగసునుఁ గనరే.

కీర్తన తోడి - రూపకం

పల్లవి దొరకునా యని సురలదొర వెడలెను కనరే

అనుపల్లవి కరకు బంగరువల్వఁ గట్టి సొమ్ములు వెట్టి
హరిసేవఁ గనులార నంతరంగముననుఁ గాన

చరణ (1): ఘనమైన హరినామ గాన మొనరించుచుఁ

జనవునను హరిసేవ సల్పనెవ్వరికైన

చరణ (2): నేఁడు తన నోముఫల మీడేరెనని హరినిఁ

బాడుచును మనసార వేడుచును సేవింప

చరణ (3): రాజముఖుఁ డవనిజా రమణితోఁ జెలఁగగఁ

బూజించు శ్రీ త్యాగరాజ సన్నుతునిఁ గన

వ. ఇవ్విధంబున వేంచేసిన బ్రహ్మేంద్రాది సర్వసుపర్వ జనంబు లత్యంత బ్రహ్మానంద పరవశత్వంబున జూచుచునుండఁగఁ బ్రహ్లాదుండు వారిఁజేరి శ్రీమన్నారాయణమూర్తిని షోడశోపచారంబులచేతఁ బూజించి నానావిధ కుసుమంబులు చల్లున దెట్టులనిన.

కీర్తన ఆహిరి - త్రిపుట

పల్లవి చల్లరే శ్రీరామచంద్రునిపైని పూలఁ

చరణ (1): సొంపైన మనసుతో నింపైన బంగారు

గంపలతో మంచి చంపకములను

చరణ (2): పామరములు మాని నేమముతో ర

మా మనోహరుని పైనఁ దామర పూలఁ

చరణ (3): ఈజగతిని దేవ పూజార్హమౌ పూల

రాజిల్లు మేలైన జాజి సుమములఁ

చరణ (4): అమిత పరాక్రమ ద్యుమణి కులార్ణవ

విమల చంద్రునిపై హృత్కుముద సుమములఁ

చరణ (5): ఎన్నరాని జనన మరణములు లేకుండ

మనసార త్యాగరాజ నుతునిపైనఁ

వ. ఈలాగున ప్రహ్లాదస్వామి శ్రీహరిని నానా విధంబులఁ బూజించి భజియించి మంగళముంబాడు సమయంబున నిట్టి వైభవముల సేవించుటకై సూర్యుండు వేంచేసెనో యన్నట్లు సూర్యోదయమైన వేడుక యెట్టులనిన.

క. సనక సనందన కమలా

సన నారద పాకవైరి సద్భక్తులతోఁ

దనుజారి బాగుమెరయఁగ

వనజాప్తుఁడుఁ జూడ నాసగొని యుదయించెన్.

మంగళము

కీర్తన మోహన - ఝంపె

పల్లవి జయ మంగళం నిత్య శుభ మంగళం

చరణ (1): మంగళం మంగళం - మా రామచంద్రునకు

మంగళం మంగళం - మాధవునకు

చరణ (2): నిజదాసపాలునకు - నిత్య స్వరూపునకు

నజరుద్రవినుతునకు - నగధరునకు

చరణ (3): నిత్యమై సత్యమై - నిర్మలంబైన యా

దిత్యకులతిలకునకు - ధీరునకును

చరణ (4): రాజాధిరాజునకు - రవికోటితేజునకు త్యాగ

రాజనుతునకు రామ - రత్నమునకు

కీర్తన ఘరజా - చాపు

పల్లవి పరమైన నేత్రోత్సవమును గనుగొనఁ ధరణివెడలెఁ జూడరే

అనుపల్లవి ధరను విధీంద్రులు కరచామరముల నిరుగడలను మెఱయ

నిరతముగను గగనమున సురలచేతి విరులవాన కురియ

చరణ (1): పరమ భాగవత చయములు బాగుగ - హరినామము సేయ

దురమున ప్రహ్లాదుఁడు కనికరమున - హరియని తలపోయ

వారిధిరాజా నారద సనకాదులు - సారెకు నుతియింపఁగ

వారము శ్రీత్యాగరాజ వరదుఁడల్ల వారలఁ గని బ్రోవగ

మంగళము

కీర్తన సౌరాష్ట్ర - ఆది

పల్లవి నీ నామరూపములకు - నిత్య జయమంగళం

చరణ (1): పవమానసుతుఁడు బట్టు - పాదార విందములకు

చరణ (2): పంకజాక్షి నెలకొన్న - యంకయుగమునకు

చరణ (3): నళినారిగేరు చిరు - నవ్వుగల మోమునకు

చరణ (4): నవముక్తాహారములు - నటియించే యురమునకు

చరణ (5): ప్రహ్లాద నారదాది - భక్తులు పొగడుచుండె

చరణ (6): రాజీవనయన త్యాగ - రాజ వినుతమైన

శ్లో. మంగళం జానకీశాయ మహారాజ సుతాయచ ।

మాయా మానుష వేషాయ మహనీయాయ మంగళం ॥

ఫలశ్రుతిః

శ్లో. శ్రీరామ బ్రహ్మతనయ త్యాగరాజేన నిర్మితం

ప్రహ్లాద భక్తి విజయ ప్రబంధం భుక్తి ముక్తిదమ్

యే గాయంతి సదా భక్త్యా యే శృణ్వంతి చ శ్రద్ధయా

యే పఠంతి సదా ప్రీత్యా తేషాం సర్వాఘ నాశనమ్.

శ్రీ ప్రహ్లాద భక్తివిజయము ఈ పంచమాంకముతో సమాప్తము.

  